శ్రీ శ్రీ శ్రీ.

శుభమస్తు.

శ్రీ భోగరాజస్వామినే నమః.

# లేడీడాక్టరు

## (నవయుగము.)

ఎన్నికలు, నిరుద్యోగము, విడియాకు, మతాంతరవివాహము, స్త్రీ స్వాతంత్ర్యము మొదలగు ప్రకృతసమస్యలకు సంబంధించిన 5 అంకముల సాంఘిక ప్రకరణము.

గ్రంథకర్త

పాణిగ్రహణ (కాలేజీగరల్) కృష్ణదేవరాయాది
నాటకరచయిత

కాళ్ళకూరి హనుమంతరావు పంతులుగారు

# తొలిపలుకు.

ఎన్నికలు, నిరుద్యోగము, విడియాకు, మతాంతరవివాహము మొదలగు ప్రకృత సాంఘిక సమస్యలకు సంబంధించిన విషయములే యీప్రకరణమునందలి యితివృత్తము. ఈనాటకమును బలుచోట్లఁ బలుసార్లు ప్రదర్శించిరి. విద్యాధికులు పెక్కుమంది, యిట్టి నాటకము లత్యంతావశ్యకము లని సదభిప్రాయములతో నాకు వ్రాసిరి. కాని "సంఘమును మరమ్మతుచేయనెంచిరి కాబోలు మహాకవి గా " రని యొక మహాపండితుం డొకండు వ్రాసి యున్నాడు.

"స్వభావో నోపదేశేశ నశక్యతేకర్తు మన్యథా । సుతప్త మపి పానీయం పునర్గచ్ఛతి శీతతామ్" అన్న ట్లుపదేశములు నైజస్వభావముల మార్పఁజాల వని యెఱుంగుదుము గాని "ఏకస్య కర్మసంవీక్ష్య కరోత్యన్యోపి గర్హితం । గతానుగతికోలోకో నలోకః పారమార్థికః" కొంతకాలము పత్రికలలో నుబుసుపోక కీగ్రంథ ముపకరించు నని "అరసికజనసంభాషణతో రసికజన వాక్కలహః శ్రేయాన్। లంబకుచాలింగనతో లికుచకుచాయాః పాదతాడనమ్ శ్రేయః" అనియు దీనిరచించితి నని ప్రత్యుత్తరము. గుణాగుణవిమర్శనము విజ్ఞులకే వదలినాఁడ.

ఈ సాంఘికప్రకరణమునకుం గూడ "నవయుగ" మను పేరిడితిని. కాని ప్రథమమున నేను రచించిన పాణిగ్రహణ మను పేరుగల ప్రకరణము "కాలేజీగరల్" అను పేరితో ప్రదర్శింపఁబడుచున్నది. "కాలేజీగరలు" వగిది నీ "లేడీడాక్టరు" పాత్రగూడ నీనాటకమున నొక యుపపాత్రగాని నాయిక గాదు. తెలుఁగు నాటకమున కింగ్లీషు

పేరుంచుట, యుపపాత్రపేరు గ్రంథమునకుఁబెట్టుట, నావలెనే కొందరి కిష్టతలేదు, కొంద రాపేరే బెట్టుమనిరి. "అయుక్తమ్‌స్వామినో యుక్తమ్ యుక్తన్ నీచస్యదూషణం । అమృతంరాహవేమృత్యుఃవిషమ్ శంకర భూషణమ్" ప్రకృత ప్రజాభిరుచిని బట్టి యాకర్షణీయమగు నిట్టిపేరు బెట్టకున్నను, ప్రజాభిరుచిన బట్టి నాటకమాడకున్నను, మాకు డబ్బు రాదని యనేకులగు సుప్రసిద్ధనటులు నాకు బెక్కురీతుల నచ్చఁజెప్పిన మీఁదట, నీనాటకమును "లేడీడాక్టు" రను పేరితో బ్రదర్శించుకొనుట కొప్పుకొని, యాపేరే యీగ్రంథ ముఖపత్రమున మాత్రము ముద్రింపించితి. ప్రకృతమున రంగస్థలములయందు, పాటకచేరీలు, కౌఁగిలింతలు, ముద్దులు, నల్లరి చిల్లరిచేష్టలు, నీతిబాహ్యనటనలు జన సామాన్యమున నాదరణీయములుగ నున్నవి.

"నిస్సారస్య పదార్థస్యప్రాయే ణాడంబరోమహాన్। నువర్ణేధ్వని స్తాదృగ్యాదృక్కాంస్యే ప్రజాయతే" ఇంత యెందులకు! గ్రామఫోను రికార్డులను వాని యమ్మకమును, జూచిన బ్రకృతకాలాభిరుచి తెలియ నగును. కాలాభిరుచినిఁబట్టి నటులు, నటులనుబట్టి కవులు నాటకములు, వ్రాయవలసినకాలము వచ్చినది.

మ. కవితా చిత్రవిచిత్ర శిల్పరచనాకష్టంబు యోచించి సం
స్తవ మర్యాద, బహూకృతిం దనువు భూదారుల్ గనన్ రారు స్వ
ర్గవులై, యాచనసేతగాదు, రసనాకండూతిమై వ్రాతు మో
కవితాకోవిద! కైత లారయ వృథాకష్టంబు లీరోజులన్.

అని యొక సందర్భమున నే నభిప్రాయ మొసంగినరీతి, నటులే కవితాకళకుఁ బోషకు లగుచున్నారు. ఈ నాటకమునందు నీతిబాహ్యవిషయములకుగాని, యట్టి శబ్దములకు గాని చోటులేదు. చోటులేకున్నను బాత్రౌచితింజెరిపి గ్రంథస్థ గద్యపద్యభావములు

గ్రంథకర్త యుద్దేశ్యముల నెఱుంగఁజాలక కూటికి వేశ్యల నాశ్రయించు కొని బ్రదుకుచు, నిరక్షరకుక్షులయ్యు నాటకకళ కంతకు బితామహుల మను నహంకారముతో "నిర్విషేణాపిసర్పేణ కర్తవ్యామహతీఫణా। విషంభవతు మావాస్తుఫటాటోపో భయంకరః" అన్నట్లు ఛాయాపత ములతో నట్టహాసము సేయుచు, పెగ్గుకొఱకు నాటకములవెనుక దిరుగు చున్నను, నాట్యకళోద్ధారకుల మని, తమబోటి యజ్ఞులచేత లేనిపోని యసందర్భస్తోత్రపాఠములు గల యభిప్రాయములు వ్రాయించుకొని ప్రకటించుచు డైరక్టరను గౌరవశబ్దమునకు గూడ నగౌరవముం గూర్చుచున్న యిబిలేషన్ డైరక్టరువలె కేవలము డబ్బే ప్రధాన ముగ నెంచి, యవినీతికరముగ రంగస్థలముల నీ నాటకముఁ బ్రద ర్శించినచో నీ నాటకపుస్తకమును బట్టి ప్రేక్షకులే దిద్దెదరుగాక. క్రొత్తప్లాటుతో నాటకము బైలువెడలునప్పటికి స్వాతంత్ర్యశక్తి లేని యాడంగు లనుకరణములువ్రాసి ముద్రించుచుండుటచే నాకుఁ దీఱిక లేక నే మఱల జూచుకొనకయే ముద్రణమునకుఁ ద్వరపడవలసి వచ్చినందుల కెంతయు సంకోచించుచున్నాఁడ.

'యథాస్త్రీణాం తథావాచాం । సాధుత్వేదుర్జనోజనః'

ఇట్లు విధేయుఁడు,

గ్రంథకర్త,

కొళ్ళకూరి హనుమంతరావు.

20—3—35

# ప్రధానపాత్రలు

## పురుషులు.

| | | |
|---|---|---|
| 1. మురళీధరుడు | బి. ఏ. | కథానాయకుడు. |
| 2. రావు | బి. ఏ. బి. యల్. | వకీలు. |
| 3. మహమ్మద్ లతీఫ్ | యం. బి. సి. యమ్. | డాక్టరు. |
| 4. వీరన్న | రైతు | మ్యునిసిపల్ చేర్మన్. |
| 5. వెంకటా్రివు | బి. ఏ. | ప్లీడరుగుమాస్తా. |
| 6. శాస్త్రి | ... | నేషన్ లిస్ట్ మెంబరు. |
| 7. సూర్యారావు | ... | పంచములమెంబరు. |
| 8. ఓట్ల ఏజెంటు. | | |

## స్త్రీలు.

1. రుక్మిణి (S. S. L. C. మురళీధరుని ప్రథమభార్య) కథానాయిక.
2. లీల (B. A.; M. B. C. M. మురళీధరునిదత్తత తల్లి) లేడీడాక్టరు.
3. సుందరి (Inter మురళీధరుని ద్వితీయభార్య).
4. యశోద (లీల యత్తగారు).

శ్రీరస్తు.

శుభమస్తు.

శ్రీభోగరాజస్వామినే నమః.

# లేడీ డాక్టరు.

(నవయుగము.)

(నాంది)

చ. సతతము భక్తకోటికి వశంవదుఁడై, ఫలదాతయై, పతి
వ్రతలకుఁ దోడునీడయయి బాములఁబాపెడు రుక్మిణీసతీ
పతి మురళీధరుండు, బుధబంధుఁ డపాస్త రజస్తమస్తముం
డతను భవాబ్ధినావికుఁ డనంతుఁడు కృష్ణుఁడు మిమ్ముఁబ్రోవుతన్.

(నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశము)

సూత్ర—నటీ! నటీ.

(నటి ప్రవేశము)

నటి—ఆర్యపుత్రా! ఏమి యాజ్ఞ?

సూత్ర—ప్రదర్శనకౌతూహలచిత్తులై ప్రేక్షకులెల్లరు నిరీక్షించుచుండ నింకను నాలస్య మేమి?

నటి—ఆర్యపుత్రా! సర్వము సంసిద్ధమైనదిగాని యీ 'నవయుగం' బను సాంఘిక ప్రకరణ మెవ్వరు రచించిరి?

సూత్ర—శ్రీకృష్ణదేవరాయ నాటకము, (కాలేజేగరల్) అని పిలువబడుచున్న పాణిగ్రహణ సాంఘిక ప్రకరణమును రచించిన కొల్లకూరి హనుమంతరావు పంతులుగారే 'లేడీడాక్టరు' అని ప్రదర్శింపఁబడుచున్న యీ నవయుగ ప్రకరణమునకుంగూడఁ కర్త.

నటి—(సంతోషమున) అట్లనా? ఇఁక సభ్యుల రంజించు టెంతపని!

సూత్ర—నటీ! నీగానకౌశలం బొకసారి చూపఁగోరెద.

నటి—మీ యనుజ్ఞ కేను బద్ధురాల.

సీ. విరహిణీబ్రగహావివగవిదారణ
శుగభంగిఁదోఁచె పుంస్కోకిలరుతి
యరుణభాస్కర బింబకిరణసన్నిభనూత్న
పల్లవరుచి నిండె వల్లివితతిఁ
సంపుల్లమంజరీసంచరన్మధుకరీ
సంగీతమలరె రసాలతరుల
సంపద్విధూతవిశ్రాంతాపశదులట్లు
పత్రిచ్యుతములయ్యె పాదపములు

గీ. నిజసుతాత్మజ పరిణయ నిర్ణయాగ
తప్రియాణబాంధవ జనోత్సాహలపిత
లాలితమిదః ప్రసంగ కోలాహలఫల
దంతరనిశాంతమలరె వసంత వేళ.

సూత్ర—(సంతోషమున) నటీ! నీగీతరాగామృతవృష్టిచే మాహృదయానురాగలతలు పల్లవించె. ప్రదర్శన మారంభింపుము.

నటి—చిత్తము. అనుజ్ఞ. (నిష్క్రమించును)

సూత్ర—వధూభిషజ్మణి రంగస్థలముం బ్రవేశించె. నిరంతర తంత్రోత్సాయసమేధిత స్వలాభరిరంసకీలానిర్దగ్ధపరనిలయుండు నవయుగనాటకసూత్రధారయు నగు వకీలు రావుగారుఁ జనుదెంచె. ప్రదర్శనము ప్రారంభమైనది. ఏతత్ప్రదర్శన విధానమునకు సాహాయ్య భూతుండ నగుదుగాక. (యని నిష్క్రమించును).

శ్రీరస్తు.

# లేడీడాక్టరు

(నవనాటకము.)

---

## ప్రథమాంకము

---

(శ్రీ లీల భవనము— లీల ప్రవేశము)

లీల—(కూర్చుండి యాలోచించుచుండును.)

[స్త్రీ రోగి ప్రవేశము]

లీల—అమ్మా! వచ్చితిరా! మిమ్ముఁ బరీక్షించెద. (అని లేచును)

[వకీలు రావు ప్రవేశము]

రావు—Good morning sister Leela !

లీల—Hullow! Brother Vakil Rao! Good Morning! Please take your seat. ఈ అర్జంటు కేసు ఎగ్జామిన్ చేసి ఇప్పుడే వచ్చెదను. ఎక్స్క్యూజ్ మి.

(లీల రోగితో నిష్క్రమించును.)

రావు—నాయాహ్వానము రుక్మిణి యంగీకరింపదు. (ఆలోచించి) అంగీకరింపదు. ఆ తిరస్కృతి లీల సహింపదు. (ఆలోచించి) వియ్యపురాండ్రిద్దరకు రగుల్కొనుచున్న వైషమ్యానలం బీయత్తకోడండ్ర పరస్పరవిరోధపాణింధమంబున దుర్భరమై, దుస్సహమై, భీభత్సరూపముం దాల్చి, (సంతోషమున) మదభీష్టము సఫలీకృత మొనర్చితీరు. నిస్సంశయము. తండ్రిలేని పిల్ల నా మేనగోడలు. ద్వితీయ వివాహమైనను గట్నమీకున్నఁ గడపఁ ద్రొక్కనీరు ధనవంతులు. ఇట్టి గొప్ప సంబంధము నాకు లభింపదు. ప్రాక్టీసు లేక ఋణబాధచే తల్లడిల్లుచున్న నేనెడఁ! బెండ్లి సేయుటెడ! (ఆలోచించి) లీల వెంకిపట్టుగలది. ఆమెకు నాయెడ గౌరవ మధికము. (తలనూచి) నమ్మకముమీఁద నెట్టివారినైనను సులభముగఁ బడఁగొట్టవచ్చును.

గీ. మనసె మైశ్వర్యయుతులమై మనఁగవలయు
నెల్లచోటుల మనమాట సెల్లవలయు
నరయుఁగ స్వలాభరహితకార్యంబటన్న
దరికిఁబోరాదు వినరాదు తలఁపరాదు.

(చేవు చేవని త్రేంచి) కానిమ్ము!

[డాక్టరు లీల స్త్రీ రోగితో ప్రవేశము]

లీల—(Stethescope బల్లమీద పెట్టి యాలోచించి స్త్రీ రోగిని జూచి)
Repeate the same dose (యని Prescription వ్రాసియిచ్చును)
(స్త్రీ రోగి చీటి బుచ్చుకొని నిష్క్రమించును)

లీల—Well vakil Rao! ఏమి విశేషము!

రావు—(చిఱునగవున Invitation cards నిచ్చును)

లీల—(Cards పుచ్చుకొని జూచి) Cosmopolitan dinner(యని చదివి కార్డులను బల్లమీఁదఁ బడవైచి బొమలు ముడిచికొని)

గీ. ఆ స్త్రీకోసము దత్తత ప్రాప్తమయ్యె।
దత్తుఁ డొదవుట కోడలు దాపురించె।
ప్రకృత నవనాగరికతా ప్రపంచమునకుఁ।
బనికిరానట్టి పరమనిర్భాగ్యురాలు.

రావు—(శిరఃకంపమొనర్చి) అట్లనా! (యని చేవని త్రేన్చును)

లీల—Brother! (యని యాలోచించి)

ఉ. చందనవాహిగర్భము చేందమునన్, సభలో, సుధారస
స్యంది సుభాషితంబు విరజల్లు, గుణగ్రహాశూన్యజల్పన
స్కందులు, సంస్కరించుకొనఁజాల, రసాదృతభూరిగర్హణా
స్పందకుటుంబ బంధుజనవారదురత్యయ దుష్టవృత్తులన్.

రావు—సోదరీ! ఉన్నమాట నొప్పుకొంటివి. చాలసంతోషము.

[రుక్మిణి త్వరితగమనమునఁ బ్రవేశము]

రుక్మి—(రావును జూచి పెడమొగము బెట్టుకొని నిష్క్రమింపఁబోవును)

లీల—(కోపమున) రుక్మిణీ! We are not devils. భయపడకుము. ఆగుము! (అని రావుసుం జూచి)

గీ. కర్కశపాతమయూర కేకారవమున
గడగడవడంకు పన్నగకాంతవోలె
చలనవలితభయాపాంగలులితదృష్టి
మగువ కంపించుచున్నది మనలఁజూచి.

రావు—Society యనిన మీకోడలికి గిట్టనట్లున్నది.

లీల—(రుక్మిణిం జూచి) వకీలు రావుగారు Cosmopolitan dinner నిచ్చుచున్నారు. మన యిరువురిని Invite చేసినారు. ఇదిగో కార్డు. (అని యీయబోవును)

రుక్మి—(కార్డుఁ బుచ్చుకొనక మాఱుమొగి మిడుకొని) అత్తగారూ! మన మతధర్మములు పూజనార్హము లనియు మన కులాచారములు పుణ్యదాయకంబు లనియు, సర్వదేశములం వేనోళ్ళఁ బొగడుచుండ మన మన్యమతాచారధర్మముల ననుకరించుట పాడిగాదు. మన పద్ధతులు పాశ్చాత్త్యు లనుకరించుచుండిరేమో విమర్శింపుఁడు. రైతువచ్చి రైలువేళ దాటుచున్న దని తొందరపడుచున్నాడు. అమ్మమ్మగారు మీతో మనవిజేసి రమ్మని నన్ను బంపిరి. (అని నిష్క్రమించును)

లీల—రావ్! నేను చెప్పలేదా? As a vessel is known by the sound whether it be cracked or not; so people are proved by their speeches whether they be wise or foolish.

రావు—(అసూయతో) ఇటువంటి B. C. కోడలిని భరించుచున్న నీ శాంతము, శ్లాఘనీయము. (చిఱునగవున) కొంచె మించుమించీమె యీడుగల యదియే నా మేనగోడలు. ఎట్టి modern views? ఎంత social గా society తో move అగుచుండును! దాని principles appreciate చేయనివారు లేరుసుమా!

లీల—(విచారమున) school final 1 st. class న ప్యాసయినది. ఎందులకు? useless. భజనలు, పూజలు, జపములు, తపములు. అదేమి ప్రారబ్ధమో భర్త తప్ప నన్యునిఁ జూచిన దానికి భయము. B. C. habits; B. C. views. ఈ యీడు పడతులు మన Educated houses లో నెట్లుండిరి;

రావు—ఈ up to date civilisation మా యింటికి రాదు, వ కోపిలెన వేయి పుటములు పెట్టినను రాదు. Hopeless.

గీ. జపతపము లెంచు నడియంచు స్నానమనుచు
నోటిలు చున్నాడు యొముకలు గొణుకొనుచు
కటుబడవు మెతుకు లోంతె గంటకైన
నెందుకీది యూసులెస్, వట్టి యోభ్యరాశి.

లీల—Educated house లో, జన్మించినది. Educated house లో బడినది. మా వాసనయైన దీని కంటు లేదేమయ్యా ?

రావు—గ్రహచారము. ఆతల్లిదండ్రుల Training అటువంటిది గాబోలు.

లీల—మా మురళీధరుని మీ రెరుంగరా !

రావు—(ఆశ్చర్యమున) Up to date fashionable youth. graduate. ధీర శాంతుడు, మహాబుద్ధిశాలి, ధర్మనిరతుడు. తల్లి పుట్టినిల్లు మేనమామకుం దెలియదా ? నే నెఱుంగకపోవు టేమిటి ;

లీల—అట్టి పురుషరత్నమున కిట్టి uncivilised bruit సంప్రాప్తించిన దేమయ్యా !

రావు—గీ. శాంతనునకు గంగ్రగయ్యాళిజెంత, యంత
గానికింగ్రోంతి, సద్గుణాఖనికిజాగ
హెచ్చు నాజూకు గలవాని కేభ్యరాశి
బ్రహ్మ సమకూర్చు నదియేమి పాపఫలమొ !

లీల—స్వతస్సిద్ధముగ నీపిల్ల బుద్ధిమంతురా లే. ఈ తర్ఫీదంతయు మా వియ్యంపురాలి గయ్యాళిగంపయది. ఆమె తాశీల్దారుగారి భార్య. నేననిన యామెకు లెక్కలేదు. చూడుము ! చెప్పుదెబ్బగొట్టినట్లు నాకసిదీఱ, మా యబ్బాయి కింకొక వివాహ మొనర్చి తీరెద. (ఆలోచించి) మీ మేనగోడలు సుందరి కిప్పుడు వివాహము జేయుందలంచిరా !

రావు—బి. యే. ప్యాసయినగాని, వివాహముం జేసుకొనననని నాతో జెప్పినది.

లీల—ఈ match settle చేయంగూడదా ?

రావు—ఆపిల్ల యిష్టము.

లీల—Brother! Kindly arrange నిగ్రహానుగ్రహసమర్థుండవు. నీవు పూనుకొనం దలంచిన నాకోరిక తీఱును.

రావు—నన్ను కోరినది గనుక మా మేనగోడలి యత్నాయము గనుక నేడ గాని చివరకు withdraw చేయవుగదా!

లీల—Brother! ఎంతమాట. నిస్సంశయముగ నీ మేనగోడలిని వివాహ మొనర్చి తీరెద. Take my word of honour.

రావు—(చిఱునగవున) నెపోలియన్ గ్రాంకయుండిన స్థైర్యసౌర్యములకు మెచ్చి లిచ్చి తీరెడివాడు. సెబాస్. భేషక్. very glad. నిద త్తపుత్రుం డంగీకరించునా?

లీల—నా adopted son నామాట కడుగుదాటడు.

రావు—అట్లైనది. సయిస్టాను నాగలు ప్రవర్తింపకున్నం జెప్పం జేకిచ్చి యావలకు గెంటెదవు. Laws grind the poor and rich men rule the law. graduate, అతనికి మాత్రము తెలియదా! (జేవని త్రేస్సి) ఈ కోడలి నేమి చేసెదవు?

లీల—కోడలి నింటనుండి తేవగొట్టుటకు మాబోటి పెద్దయిండ్ల రెండు మార్గము లున్నవి. విషప్రయోగము, వ్యభిచారనిందారోపణము. నిరపాయమై యుత్తల కౌర్యసాధనానుకూలమైనది వ్యభిచారనింద. మన కిప్పుడదియ సాధనము. (యాలోచించు చుండును)

రావు—you can safely rely upon me on that score. నే నున్నాను. భయము లేదు. (తనలో) Alright, Rukmini shall understand what the refusal of Row's invitation would be.

లీల—నీ చెప్పినట్లు చేసెద. (కోపమున) నా View నా life యిష్టము లేక న న్నల్లరిబెట్టుచున్న వియ్యంపురాలి కూతురు నాయింటం గాపుర మెట్లు సేయును! I shall See! settle that match.

రావు—(చిఱునగవున) మంచిది. నీ దత్తపుత్రు డెప్పుడు వచ్చును?

లీల—బి. ఏ. పరీక్ష యీ 15 th. న కయిపోవును. గడియయాగడు. ఆరాత్రి వచ్చి తీరును. ఆ రాత్రియే యీ plot.

రావు—ముసిలిది యూరకొనునా!

లీల—Who cares for that old hag. (ఆలోచించి) ఈ vecation లో మీ మేనగోడలిచ్చుటకి వచ్చునుగదా!

రావు—yes. By all means.

లీల—ఇంక నీ ప్రయత్నమున నీ వుండుము.

రావు—నియ్యాఁపురాండ్రపై గసి తీర్చుకొనవలయుననిన నిదియే పద్ధతి. (బ్రేవని త్రేన్చును)

లీల—Brother! ఏమిటీ త్రేపులు! Indigestion chronic అయినట్లున్నది. మందు పుచ్చుకొనరాదా!

రావు—Diet cures, and the doctor takes the fee and credit.

(తెరలో కాలి చప్పుడు)

రావు—(వినుచు) ఎవరు? (కోపమున) డాక్టరు లతీఫ్ సాహేబా లీలా!

లీల—కావచ్చు.

రావు—లీలా! నీవు wisdom నశించుచున్నదిసుమా!

లీల—What do you mean!

రావు—చిరకాలమునుండి మీదావాలలో బని సేయుచు, సచ్ఛ్రేయోభివృద్ధిఁ గోరుచున్న వకీలును. అందుచే జెప్పక నాకుఁ దప్పదు. నీవు కులధర్మములఁ బాటింపక పోవుట మంచిది కాదు. అది కీడు.

లీల—రిఫార్మరు నని గంభీరోపన్యాసములు, న్యాయవాదులలో న్యాయము, సంఘసంస్కారులలో సంస్కారము, నేఁబీరకాయలోని నేయివంటివి గాబోలు.

Brother! Intercaste Marriage is the panacea for all the evils under which the Hindu society groans and it is the chief means of wielding the various sections into one great united Hindu Nation.

రావు—నీ యిష్టము నాకెందులకు? నీవుఁగూడ నావలె నేఁబీరవు గాకున్న నావలఁ జింతించెదవు లెమ్ము.

[డాక్టరు లతీఫు ప్రవేశము]

రావు—(చూచి కోపమునఁ బెడమొగము పెట్టుకొనును)

లతీ—(రావునుఁ జూచి తనలో) ఈ Villain వచ్చినాడెందులకు? లీలా mind poison చేయడం లేదుగదా? good moring లీలా?

లీల—Very good morning. Take your seat there.

లతీ—(దూరముగ కూర్చుండి) అరే. చూడనేలేదు. రావ్. Good morning.

రావు—(తలనూచి కటికి నగవుతో) Congratulations to the uncontested President (తల నూపుచు) అసలే Leading Doctor garu పైగా President కూడఁగాబోవుచున్నారు. మే మగుపింతుమా.

లతీ—దేవుగారి చూపులో మే మెంత?

రావు—నిశ్చయమే గాని, యీ వెక్కిరింతలకు Doctor Sambam's prescription ఏ నిను బాగుగా జనిసేయును.

లీల—(లతీఫును జూచి) ఔనుగాని, డాక్టర్సులో డాక్టర్సు కొట్టుకోనుటయేమిటి Educated gentlemen. That does not look nice.

లతీ—(నవ్వుతో) లీలా! నేను మూడు నెల్లనుంచి, ఒక షావ్కార్ Case treat చేస్తున్నా urgent పని వొచ్చింది. ఊర్కి వెళ్ళాను. డాక్టరు సాంభం treat చేస్తాడా. బేకూఫ్. ఓతీలేరూ. బుద్ధిలేదూ! సిగ్గాలేదూ!

రావు—లీలా! గురివెందపూస, క్రింద నలుపెరుంగదుసుమా!

లీల—Doctor Latiff is a good hearted and noble gentleman అసోషియేషన్ రూల్సును బట్టి డాక్టరు సాంబము చేసినపని తప్పు. క్రమముగ డాక్టర్సు ప్రొఫెషన్ యొక్క ప్రెస్టీజ్ పోడగుచున్నదిసుమా.

రావు—దానికీ యిస్పేటు జాకీయే మార్గదర్శి.

లతీ—(నవ్వుతో) ఈదేవూవల్ల Vakils noble profession prestige పోడవడం లేదూ?

లీల—Students వలె నీ nick names ఏమిటి? A joke never gains an enimy but often looses a friend.

—ఔనుగాని, లీలా 10 రూపాయల మందుతో Cure అగు కేసునకు 30 రూపాయల మందులు patient చేత కొనిపించి తస్కరించి, తక్కిన Cases కు వాడుకొని, ఫీజు, మందు చార్జి లాగుట. మొదటి Patient న కేబది రూపాయల బిల్లుం బంపుట. ఈయకున్న దావా. నీకి, Character ఉన్నదా! Leading doctor (దేవని త్రేన్నును).

లతీ—(చిఱునగవున నవ్వుతో) లీలా! Recovery of jeroity land. Valuation 2 వేలు వేశాడు. 3 years కు 11-4-0stamp duty లాగినాడు. హీరింగులిక్కి రాకనానాపిప్పల్ బెట్టినాడు. ఫీజు మాత్రం నూటికి 5 ఉంటే పది పుచ్చుకున్నాడు. ముద్దముద్దాకు బిస్మిల్లా. స్టాంపులని, పిటీషన్లని, private ఖర్చులని, లాగినాడు. నీకూ గేపకంలేదూ. అంతా అబద్ధం. శక్కర్. అప్పీల్ వాళ్ళకీ దేవ్. గుమాస్తాజీతాన్కి దేవ్. స్టార్టలసొమ్ముకి దేవ్. Court refunds కీ దేవ్. కోర్టులో లేస్తే దేవ్. కూర్చుంటే దేవ్. దొరావేషం

నేస్తునేవాఁ. Character, honesty యందుఖ్యాగ్యాతాలో వేసి, యెుకినా ఉంది. ఆనవాళ్ళదగ్గిర leading vakil చెప్తాను. మునిస్పాలిటీ మేస్ట్రీటు కోర్టులో సిద్ధం.

లీల—Unpleasant. Drop further discussion. Professions. అన్నియు గౌరవముగలవే గాన Local practioners మగు మనమే వాని గౌరవములఁ బాడు సేయుచుంటిమి. Meanness కు stoop అగుచున్నవాడే Educated man. అదియు వాడి తప్పుగాదు.

గీ. కాలమానముబట్టి యభిమానములుపెంచు
కాలమునుబట్టి నడతలు గలుగుచుండు
కాలరూపప్రపంచరంగస్థలమున
పాత్రధారులు మనకోటి ప్రజలుతలఁప

లతీ—(రావును కోపదృష్టిం జూచుచుఁ జిఱునగవున) yes. Really.

లీల—నేను చెప్పిన విషయమే యిందున్నది. చూడుము, (అని పత్రిక నిచ్చును)

లతీ—(చూచుచుండును).

లీల—(లతీపు వైపు చూచుచుండును).

రావు—(తనలో) ఈవాగాడంబరుడా నన్ను వెక్కిరించువాడు. ఈ uncontested president గారికి వేవుమజా శాశ్వతముగ జ్ఞాపక ముండునట్లు చేయ కున్న బహుతంత్రిక పటోపాయధీబలనిర్జదాపరచాణక్యావతారుండగు నీరావు చేనే. నాచూపు నాగాలి ప్రసరించినంత మేర నెవ్వఁడు నేవిధమున నభివృద్ధిఁ జెందఁగూడదు. అభివృద్ధిఁ బొందుచుండునా పద్మవ్యూహముం బన్ని, చల్లగ నిజికించి, బుక్కాపకీరును జేయువఱకు రావు కంటికి నిద్దురరాదు. కానిమ్ము. ఈ elections లో నితఁడు stand అయిన President పదవికిఁ ధనమదోన్మత్తతచే గొండొక కారణంబున నన్నవమానించిన చేర్మెన్ వీర న్నను పోటీగా నిలిపి, నాటకమాడించెదగాక. ఈమె యీనను stupid అనినఁ బడిచచ్చిపోవుచున్నదేమి ?

గీ. దక్షిణాదిగొల్ల దకన్నుసాహేబు
నాటుకైస్తవుండు నచ్చినట్లు
స్వచ్ఛనిజకళలుండు నచ్చఁడుగా బోలు
చదివికొనిన యట్టి జలజముఖికి.

Latiff సాహేబుగారి nobility ముంగుముం దీమెను పశ్చాత్త్యపురాలి నొనర్చుదుగాక. (ప్రకాశముగ) Well good bye లీలా! (యనినిష్క్రమించును)

లీల— Well Latiff ! నీ President election campaign ఎంతవఱకు వచ్చినది?

లతీ—(ఆనందమున) నాకింతవరకు opposite party లేదు. నీ Nominated seat తో నాకు యిరవైఓట్లున్నాయి. మిగిలిన వోట్లుకూడా నీ influence వల్లనే రావాల.

లీల—నీకు జయంబు చేకూర్పనెంచియేగదా యితరుల తగ్గించి నిన్ను నిలువబెట్టితిని. కానిమ్ము.

(తెరలో బిగ్గరగ) ఏమే కోడలుపిల్లా!

లతీ—(తనలో కోపమున) Old hag. (ప్ర) లీలా! ఈ ముసిలిదాన్ని యింటోంచి గెంటెయ్యరాదూ! Troublesome fellow.

లీల—ప్రాణము లన్నియు నామీఁద బెట్టుకొని నన్ను గన్నకూతురుగ జూచుకొనుచున్న యుత్తమురాలు. నాకిష్టత లేకున్నను దత్తతఁగల్పించి యాస్తిని లువ బెట్టి, యీ నాయున్నతికి, విద్యాభ్యాసమునకుం గారణభూతురాలైన యుదారహృదయ. ఆమెయత్తగారేగాక నాకు మేనయత్త. విద్యావతి. పూర్వాచారపరాయణ. భగవచ్చింతనాతత్పరహృదయ. సబురిజస్త్రీరుధర్మపత్ని. ధనవంతురాలు.

(వృద్ధాంగన యగు యశోద ప్రవేశము)

యశో—(వచ్చుచు కోపముతో) ఏమే! కోడలుపిల్లా! ఎన్నిసారులు పిలిచినను రాకుంటివేమి? (అని దగ్గరి కేగుచు లతీఫును జూచి) మహానుభావుడు వచ్చినాడూ?

లీల—నాతో మాట్లాడుటకు వచ్చినాడు.

యశో—బాగుగనున్నదమ్మా. (కోపముతో వెనుకకుఁ దిరిగి మెల్లగ నిష్క్రమించుచుండును)

లీల—Poor woman. She does not know what society is !

లతీ—Yes. Really. Good bye లీలా! We shall meet again.

(నిష్క్రమించును)

లీల—Good bye (యని మరియొక వైపునకు నిష్క్రమించును)

యశో—(ఇటునటు జూచి) తన యింటికి వచ్చు రోగులు, తన మందులు, తనడబ్బు, గౌరవ మగు తన కాలక్షేపము తనకు మంచిదిగాని, వీధిలోగొడవ తన కెందు లకు? ఒకరిజోలి తన కెందులకు? పరపురుషుని ప్రసక్తి తన కెందులకు? ఇది యెవ్వనికైన నమ్మఁదగిన కాలమా? అన్యులతో వ్యవహారసంబంధము, అన్యులతో గోష్ఠి, కులస్త్రీలకెప్పటికైనము ప్పే. ఆ వకీలురావు, నిసాహేబు చివరకు దీని నేచిక్కులలోనికి దింపెదరోగదా. ఏమిచేయను? ఏమిదారి?

మ. అసలే పెంకిది, యాపయిన్ యువతి, యాపై పశ్చిమాశాకళా
భ్యసనోద్భూత మదచ్యుతాచరణ, యాపై డాక్ట రాపైన దు
ర్వ్యసనస్వస్తికృతాప్త దుష్టజనతావ్యాసంగ మాపైన ద్ర
వ్యసకృద్వైభవ, యింక నాకు వినదేమైపోవునో దైవమా!

(నిష్క్రమించును.)

## ద్వితీయరంగము.



[వకీలురావుగారి కచేరీ సావడి, గుమాస్తా వెంకట్రావు ప్రవేశము]

వెంక—(విచారమున పెట్టెను (office box) ముందరబెట్టుకొని కూర్చుండి)

గీ. తగవులే లేవా? ప్రజలలో ధనము లేదా?
పట్టుమని యొక్క నూటు చూపట్టదయ్యె
పెట్టెఁజూచిన దుఃఖంబు బుట్టుచుండె
పొట్టపోషించుకొనుదారి యెట్టులింక?

ఇన్ని మనోవర్తి దావాలు దాఖలగుచున్నవి, మాకొక్కవకాల్తనామాయైనను రాకుండెనేమి?

[వకీలురావుగారు వీధిలోనుండి కచేరీసావడిలో ప్రవేశము]

రావు—(నిలిచి యాలోచించి) ఏమయ్యా? గుమాస్తాగారూ? చెయిర్మన్ వీరన్న గారు వచ్చినారా?

వెంక — (లేచి నిలిచి) చిత్తము రాలేదండి. (జాబు నిచ్చి) లేడీడాక్టరుగారు మీ కీ యుత్తర మిమ్మని పంపినారు,

రావు — (పుచ్చుకొని చూచి జేబులో బెట్టుకొని తనలో) చెయిర్మను వీరన్న రావల సినదే. వెళ్ళినవారు నామంత్రు లసాధ్యులు. కరటకదమనకులు. వారిజిత్తు లలో బడని వాఁ డుండునా ; అమాయికుఁ డీ వీరన్న యెంత ? (ఆలోచించి) మెడికలుఫీజుదావాలో లతీఫుపై వీరన్నకు గాఢమగు మనస్పర్థ గలదు. అదియునుంగాక పదవు లనినను, బిరుదు లనినను, వీరన్నకుఁ దగని వెఱ్ఱి. అందువల్లనె చేర్మన్ పదవికి 15 వేలు ఖర్చుపరచినాడు. నాపన్నాగము నెరవేరితీరును. ఆదురాశాస్వభావుఁడు నాతంత్రోపాయబద్ధుఁడుగాక పోఁడు. ధనికులకే ధనాశ మిక్కుటము. వచ్చితీరును. (యాలోచించి) ఏమయ్యా గుమాస్తాగారూ ?

వెంక — చిత్తము. ఏమి సెలవు ?

రావు — లక్ష్మయ్య బకాయిఫీజు జమకట్టించినాఁడా ?

వెంక — లేదు.

రావు — (ఆలోచించి) టైపునకుఁ బోయుదురు. నకళ్ళకుఁ బోయుదురు. మామూళ్ళకుఁ బోయుదురు. ప్లీడరకి మాత్రము ఫీ జీయరు. ప్లీడర్లను బుట్టలోబెట్టు పార్టీలు బైలుదేరినారు. (ఆలోచించి) మాస్థితియు నట్లనే యున్నది.

గీ. వృత్తి గౌరవ మెల్లను వీటిఁబుచ్చి
యెంతకైనను జేసాచి యేగుచుండు
క్రిమినలు వకీళ్ళచే దలక్రిందులయ్యె
సివిలు లాయర్ల ఫీజులు చివరి కకట!

(కోపమున గుమాస్తాను జూచి) క్లయింట్లయొద్దనుండి బకాయిఫీజు రాబట్ట జాలని గుమాస్తా లుండి యేమి ప్రయోజనము- ఏమయ్యా? గుమాస్తాగారూ? మీమూలమున రెండు పార్టీషను సూట్సు, 3 యిన్‌సాల్వెన్సీపిటీషన్సు చెయి జారిపోయినవి। మంచిఫీజు మంటఁగలిసిపోయినది- నిన్న, మొన్న రాలేదే మయ్యా ?

వెంక — (భయభక్తులతో) పనియుండిన నేనేల రాకుందునుబాబూ ?

రావు — (కోపమున) ఉండినను రావలయును, లేకుండినను రావలయును, బజారునకు నేను పరువెత్తనా ? (యని పేపరు చూచుకొనుచుండును)

వెంక—(దూరముగ నేగి తనలో) జీత మడిగిన వాలంట్రీ యనును. వాలంట్రీ యడిగిన జీత మిచ్చెదననును. చివరకు జీత మరువు. వాలంట్రీ యగువు. అరువు చాకిరీతో నాయాయువు మట్టమగుచున్నది. అడిగిన కోపము. ఊరకొనిన మెజువు.

గీ. షైలుచేరకయున్న నిర్భాగ్యుఁ డనును
పార్టీఫీజెగగొట్ట నపాత్రుఁడనును
యింటిపని సేయకున్న నాకెందుకనును
అరువు జీతంబునకు బూతులాట యగును.

ఎంతవరకు వారి పెట్టినిండాలి, మా కడుపు మండాలి. (తలనూచి) గ్రాడ్యుయేటునను నభిమానముఁ జంపుకొని, యేయుద్యోగము దొరకక యింటుల కొడబడినను, చేతిలో కాని కనుపడదు, చివాట్లు తప్పవు. (ప్రకాశముగ) వివా సెలవు ప్రకార మట్లనే వచ్చెద. బకాయిజీతమైనను ననుగ్రహింపరా?

రావు—(ఆలోచించి) దానికేమి, మాట!

వెంక—చిత్తము. చిత్తము. (అని దగ్గర కేగును)

రావు—ప్లీడరు షైలు గుమాస్తాలో నున్నది. క్రొత్త, గ్రహచారము నీకుఁ దెలియదు. పార్టీలను దీసికొనివచ్చిన నీవాలంటరీ నాకెందులకయ్యా?

వెంక—షైలు తక్కువగ నున్నపుడు జీత మిచ్చెదనంటిరిగదా!

రావు—అనిన-నడిగెదవా? చెప్పెదుమాట వినుము. ఇరుగుపొరుగు ప్లీడర్లయిండ్లకుదయమగుసరికి పార్టీలు వచ్చుచుందురు. పల్లెటూరిపార్టీ పాగా బెట్టుకొని పైన బట్ట గప్పుకొనును. రికార్డుతో మడిసంచులెత్తుగ గన్పడును. అదియే గుర్తు. విధవాంగన గనుపించిన మనోవర్తిదావాయే. సందేహము లేదు. వారి కొత్తా ప్లీడరుకంటె రెండువంతులు తక్కువ ఫీజునకే పనిసేయుదు మని చెప్పుము. వినకున్నచో నీకుదోచినంత ఫీజిమ్మని చెప్పుము. అంతకు రాకున్నచో నాఫీజుగూడ ముందీయనక్కరలేదని చెప్పుము. రంగుచేసి పార్టీలను లాగికొనిరమ్ము. ఇదిగో ఇరుగుపొరుగు ప్లీడర్ల కొత్తా లన్నియుఁ జల్లగ నిటు త్రిప్పివైచుట నేర్చుకొనవయ్యా, ప్లీడరుగుమాస్తా కుండవలసిన తెలివితేటలేయవి. పార్టీలకొఱకు మనమే పరుగులిడురోజులువచ్చినవి. Depression ఏమి చేయము? (వీథివైపుఁ జూచి) అడుగో పార్టీ. పరువెత్తుము. పరువెత్తవయ్యా. సంచు మళ్ళుచున్నాడు. వాలంటరీ యంతయు నిదే. ఆడుగే పడదాయె ప్రారబ్ధము!

వెంక — (నిష్క్రమించును)

రావు.— (కుర్చీమీదఁ గూర్చుండి తెనుగుచరిత్రను జూచుచు నాలోచించుచుండును)

[చెయిర్మను వీరన్నగారు ప్రవేశము]

వీర — దండాలండి బాబూ! దండాలు.

రావు — మ్యునిసిపల్ చెయిర్మనుగారా? ఆఁ వచ్చినారూ? దయచేయుఁడు.

వీర — సిత్తం. సిత్తం. వరసినం లేదేంటి బాబూ?

రావు — ఊపిరిత్రిప్పుటకుఁ వీలుబడితేను. బోలెడు సూట్సు, వ్యాపారము. ఈ నెలలో Insolvency petitions 15. Original suits 11. Possession suits 8. Partition suits 6. Appeals 4. ఫైలుచేయించితిని. నేటికి 15ను దినముల నుండి మూఁడు కోర్టులలో నాడ్జర్నమెంట్సు. ముగ్గురు జడ్జీల నింకొకపని ముట్టుకొనకుండఁ గూర్చుండఁ బెట్టితిని, సెలవలుదగ్గిరఁ బడుచున్నవి. తీరుబడియెక్కడ? (బేవని త్రేన్చును)

వీర — ఊసూన్స్! అదీకతా!

రావు — (చిఱునగవున) పెద్దబిరుదుపొందితివట. పేపర్లో నీఫోటో చూచితిని. చాల సంతోషము.

వీర — సీ. పసువులసంతెట్టి పాకలు గట్టించి
రెట్టింపుపన్ను రాబట్టినాను
గాటీలతోపాటు గంగ గల్సినపన్ను
పెద్ద మేడలమీఁద రుద్దినాను
సీపర్ల గుంస్తాల జీతాలుతగ్గించి
ఆపీసులో నిల్వ సూపినాను
ఊళ్ళోని దొంగసైకిళ్ళను బట్టించి
దిట్టంబుగా పన్ను గట్టినాను

గీ. మునిసిపాల్టీ రుణము దీర్చి మోగినాను
గచ్చురెస్టాను క్లొబ్బు గట్టిచ్చినాను
సెప్పదగినోళ్ల కిందులు సేసినాను
ఎవరికిస్తారు బిరుదు నాకివ్వకుండ.

నాయన నోగు విరగనుగాని, అమ్మా! ఐతే విరుగుతేండి. ఆవిరుగుకు గౌరవం వచ్చిందగి, ఇసుమంటోళ్లకే నిరువని. మా వోళ్లంధరు నన్నూ రేగించి ఉచ్చవం జేశారు. ఆఫీచర్లందరికి టీపార్టీచ్చాను. మీరు పేపర్లో సూసిన పాటిగ్గాపదీ

రావు—(చిఱునగవున వీరిన్నను జూచుచుండును)

[వీరుడు గారు చెప్పిన యానవాళ్లుగల యాసామీతో గుమాస్తా వెంకట్రావుప్రవేశము]

వెంక—(ఆసామీచేయిఁబట్టుకొని) రావయ్యా! ముందక్కురలేదు—ఫీజు. (అని తీసుకొనివచ్చి వకీలుగారియెదుట నిలిపి నిష్క్రమించును)

రావు—(ఆనందమున) కంగారెందులకు? నీ కేసు సమాధానము చెప్పుము.

మంగ—సిత్తం. సిత్తం. మాకెవరైతేనేంబాబూ! (అని చంకలోనున్న పొది బయటకు దీయుచు) సౌరమా, కత్తిరింపా?

రావు—అఁ (యని తెల్లబోయి జూచుచుండును)

మంగ—(తెల్లబోయి చూచుచుండును)

వీర—(మంగలినిజూచి) అఁ తెల్లబోతా వెందుకూ అంట! ఇంగిలీసు సదువుకున్న మారాజులు. బేమ్మడొచ్చి చెప్పాలిగాని, ఆరింటో తద్దినాలే ఆరికి తెలదు. ఇయ్యేలమంచిదిగాదు గామోసు, నువ్వైనా పంచాంగముసూసుకో వొద్దూ. అఁ ఎత్తుమొగమా. ఎల్లు. ఎల్లు.

రావు—పో. పో. ఇప్పుడు గాదు.

మంగ—బోణీబేరంబాగుంది గాశారం. ఆకొడికిన బిందుకు లాక్కురావాలంటూ. (అని నిష్క్రమించును)

(తెరలో బిగ్గరగ) కోర్టెక్కడబాబూ!

(తెరలో బిగ్గరగ) అమ్మా! రండి.

[వృద్ధవిధవాంగనతో వెంకట్రావు ప్రవేశము]

వెంక—అమ్మా రండి. (యని యామెను వకీలురావుగారి యెదుట నిలిపి తానుపెట్టె యొద్దఁ గూర్చుండును)

రావు—(అనుమానముతో) ఏమిటి మనోవర్తివ్యాజ్యమా?

విధ—(కోపమున) ఎనభైయేండ్ల ముసలిముండను, నాకిప్పుడు మనోవర్తి యేమిటి? వ్యాజ్యమేమిటి? (యని చంకలోనున్న రాతచిప్పను బైటకుదీసి) ఊపులుసు రాచ్చిప్పకోసం బజారునకు వెళ్ళి బంధువులు యిల్లు మరచిపోయాను. పంచాయితీకోర్టువద్ద వారియిల్లు. ఆయిల్లు చూపెడతారుకాబోలు రమ్మంటున్నారని నేననుకున్నాను. మీకు తెలుసునా నాయనా!

రావు—(తెల్లబోయి వెఱ్ఱిమొగము పెట్టుకొని) ఈవీరన్నగారి నడుగండి.

వీర—ఉఁఉఁ. బాగుంటావ్వారం. ఆరిబంగారు లెవరో నాకేం తెల్సు. సోదికెళ్లాలి. కూటిలో కెల్లవమ్మా. అయ్యో. ఎల్లమ్మంటే. ఇది సీదరుగోరి కసేరి.

విధ—(కోపమున) ఇంతుకా యీయబ్బాయి నన్ను దప్పుకొని వచ్చినాడు. నాతో నా వేళాకోళము. నావంటివాళ్ళ మీసు లేరా అను అనుగుతా. అల్లరిబిల్లరి మేళం లాగుంది. (అని నిష్క్రమించును)

రావు—(గుమాస్తాను జూచి) గుమాస్తాగారూ! మీసర్వీసు నాకక్కరలేదు. వెళ్లి వచ్చును. ఈపటినుండి మఱియొక పని చూచుకొనుఁడు.

వీర—(గుమాస్తాతో) పీదరుగుమాస్తా అంటే సీద రంతోడన్నమాట. అంతే. పీదరుగోరు బల్లగుద్ది వాదిత్తాడు. దావాకీ వోడనికీ, కావాలిసిందంతా గుమాస్తా రాసి ముంగ లెడతాడు. అంతే. పీదరుగుమాస్తాఅంటే మాటలా! ఏంటో అనుకున్నాను. ఈగుండరగోళవంతా సిదంటయ్యా. ఆఁ. పిటీసను రాత్తే గల్లనమోగించి బెత్తంటి రూపాయి మెత్తగ సేతులో యేసుకుంటారు. మా రాజంటి నౌకిరీ మంటగలుపుకున్నావు. బేమ్మడ. ఎఱ్ఱిబేమ్మడ.

రావు—(లేచి) వీరన్నగారూ?

వీర—అయ్యా!

రావు—మీతో మాట్లాడవలసిన పని యున్నది. ప్రైవేటురూములోనికి వెళ్ళుదము రండు.

వీర—సిత్తం. సిత్తం.

(వకీలు రావుగారు, చెయిర్మనువీరన్నగారు నిష్క్రమింతురు)

వెంక—గీ. బ్రతికి చెడినట్టి ఘనుని గొల్వంగవచ్చు
పెట్టినను పెట్టకున్నను బ్రీతితోడ
చెడిబ్రతికినట్టి మనుజునిఁ జేర రాదు
ఆత్మగౌరవ మాశించు వ్యక్తికరయ.

గ్రాడ్యుయేటునను గౌరవమైన జాడలేమగదా. (ఆలోచించి) కాలమహిమ. ఆహా! ఈ డిగ్రీలు, నీపరీక్షలు, నెంత నిరర్థకములైనవి.
(విచారమున)

శా. పిత్రార్జితంబగు నిల్లు మాన్యములు సద్యోగ్రగేచ్ఛన్మైవిమ్మ,యీ
విద్యాసాక్షరయి, నౌకరీ దొరకఁ గీర్తించ్చెనాఁడింటి వ న
న్యాయత్వంబెట్టి విడచుఁ నాఁడెగడ, మెట్లాల్పిడ్డఁ బోషింతు నే
నమ్మో! యెచ్చటిస్తవసిన్నటుల వెలిబఁ సత్యసంబు నిచ్చింగదా.

దైవమా! ఎచ్చటికేగినను B, N. B. నియోగ్యాగి దైనికి శక్తుల గూడ దాపు రించె. ఏమిగతి!

శా. సంపాదింపఁగ దారి గానఁబడదు, సంసారభ్రయం బాత్మ నం
పంపుంగోఁతనుగోయు, నబ్బముగుడున్ బాలెంతయిల్లాలు, ము
ల్కంపల్ జుట్టినరీతి, నప్పులవెతల్ గారించెడుం బిల్చి పో
షింపన్ దక్షుఁడు గానడయ్యె సఖటా! చేసాప సిగ్గయ్యెడిన్.

నీచవృత్తికి మనస్సొగ్గదు. పైకి దారిలేదు. క్రిందికి బోలేను. గ్రాడ్యుయేటు బ్రతుకు, చివరకు, త్రిశంకుస్వర్గమైనదే. కులవృత్తిని నిరసించి, సేవకవృత్తి కాశించిన వ్యక్తికి జీవనపరీక్షాసమయ మేతెంచినది. కులవృత్తిని నమ్ముకొని యున్నవాడే యప్పటినుండి యిప్పటివఱకు ఆస్తిని, నిలుపుకొని, సర్వవిధం బుల సౌఖ్యపడుచున్నాడు. 'కులవృత్తికి సాటిలేదు గువ్వలచెన్నా' యను నార్యోక్తి యథార్థము. యథార్థము. అహా ?

శా. క్షౌరంబయ్యె కచేరిలో బనులు, నిస్సారంబుమై గప్పె, సం
సారంబా చెడిపోయె, సంతసములా చచ్చెన్ మనోధైర్యమా
నీరయ్యెన్ బహు దుర్దశల్ దవిలె డిందెన్ దేహసౌఖ్యంబులా
ధారం బెందునులేదు, నీకృపను పెద్దమ్మా! దరిద్రేశ్వరీ.

నేటితో బుద్ధివచ్చినది. బుద్ధివచ్చినది. నా తాతతండ్రులనాటి గ్రామపౌరోహిత్యమే నన్నుద్ధరించు కులవృత్తి. చల్లగస్వగ్రామముఁ జేరెదగాక. (నిష్క్రమించును)

(తెరలో వీరన్న బిగ్గరగ) దిగడంవొచ్చిందంటే బెమ్హాండం, తల్లకిందులైనాజరే నివరి దాంకా నూసెయ్యవొలిసిందే.

(యనుచు వీరన్న రావుతో ప్రవేశము)

వీర—పట్టుదలొచ్చిందంటే యింక నాకు, యెనకాముందూ గాపడదు. ఆఁ. ఏఁవైనాజరే. (యని సంశయించుచు) ఇంతాదిగితే ఉన్న నేరుమేనుగిరీ ఊడిపోయి, నివరికి పెళిడెంటుగిరీ సెడిపోయి, రెంటికి సెడ్డరేవణ్ణిగానుగందా. గెలుత్తానా! ఆఁ.

రావు—ఏమాత్రము నీవు సంశయింపనక్కరలేదు. నాది పూచీ.

గీ. అవని కంపించి తలక్రిందులైనఁగాని
యంబునిధి సప్తకంబు బీకమైనఁగాని
జయుఁజయుఁడు ధ్యాన సుప్రసన్నంబు గురియు
నిన్ను ప్రెసిడెంటు గద్దెపై నిలుపువాఁడ.

వీర—(సంతోషమున) ఆఁ. ఏటండి నాకింతగా వోకుదత్తుంజేశారు. నాకవుద్దైర్యం లేదు. నకే కొనిండి. ఇప్పోగి చేరేది. ఏంగ్యా నాజరే. తెగండి. ఆ అతీపు గాయిాబుమీద కన్నుదీరాల. ఎన్నైనా నాజరే. చంపాయించిన డబ్బంతా దీనికింకెడతా. మీదయవోల్ల బగమంతుడు రచ్చించి పెశిడెంటుగిరీ వొచ్చిందా, యీడబ్బు లెక్కేంటి. అప్పుడు సూడండి నాతమాసా. ఆ వైర్యం ఉండే దిగుతున్నా. పదేనుసంచుల్లో సేరుమేనైనాను. ముప్పయి సంచులు నాయిగావంటే గుబిక్కైన బోర్డు పెసిండెంటయి కూకుంటా. రెండు బిగ్గీలు శాంక్సను చేత్తినాలోటేంటి! పార్టీమెంబర్ల నరగా సంతోస పెట్టొచ్చు,

రావు—వీరన్న కొప్రా,

వీర—అయ్యా!

రావు—నీనొక వెలుగు వెలిగెదవు. నీముఖకళ యట్లగుపించుచున్నది.

వీర—(ఆనందమున) నిజెంగా, మీతోడు.

రావు—గాలివిమానంమీద గజ్జెలు గట్టుకొని, గళ్ళుగళ్ళున నీపేరు లండనుదాకా తాండవమాడిపోవును. ఎందుకు, అప్పు డనుకుంటావు.

వీర—(సంతోషమున) మరెందుకు? నన్ను తీసికెల్లి నిలమెట్టించండి. ఆ నెమ్మర్లం దర్నీ తోలుబొమ్మలమల్లె ఆడిత్తా. తస్సాగొయ్యా! బాబోయి, మీరు నాయెనకొలుండి సెక్రందిప్పాలి. అప్పుడుంది చాయిాబుతమాసా. నాపగ దీరాల. అదే నాకు కొవాల్సింది. నిజంవేనా?

రావు—ముమ్మాటికీ నిజమే.

వీర—నిజెమంటే నిజెమే. నిజెమంటే నిజెమే. రేపు మదేల నాపేరేయించి, నన్ను గట్టిగా కదలకుండా నిలమెట్టించండి. నాకొత్త సీడన్ కొరేసుకొత్తా కసేరీకి.

రావు—(చిఱునగవున) మంచిది. పోయిరమ్మా. నాకుఁ బనియున్నది.

వీర—సిద్ధం. దండాలండి. మరిసెలవ్. (అని నిష్క్రమించును)

రావు—నామంత్రాంగ మీతని తల కెక్కినది. కేవలము, పరోపకారహృదయులకీ elections లో నిలుచుటకు సిడలేదు. ధనాఢ్యులగు సెట్టితులకే యీపదవుల వెఱ్ఱిపట్టుకొనినది. ఏవెఱ్ఱియైనవదలునుగాని, యీ యలక్షను వెఱ్ఱిమాత్రము వదలదు. లేనిచో వీరు insolvents గారు మాబోంట్లకు నాలుగువేలు దొరకనుదొరుకవు. (తలనూచి) ఇప్పటికి నా grips లో నిఱికికొనినా డీవీరన్న. కానిమ్మా, మఱచితిని. (యని జేబులోని చీటినిదీసి చూచికొని) పురమందిరమున సనాతనధర్మోపన్యాసమునకు రమ్మని డాక్టరు లీల చీటి నంపినది. (చేతిగడియారముం జూచుకొని) టైమున్నది. పోయివచ్చెదగాక.

(యని నిష్క్రమించును)

# నవయుగము

## ద్వితీయాంకము.



(ప్రథమరంగము)



[లీల మందిరము. డాక్టరులీల వకీలురావు ప్రవేశము]

లీల—(ఆలోచించి) Brother ! The destiny of any society at any time depends on the opinion of its young men.

రావు—Yes. Really.

లీల—నీ Up to date reasoning తో, మొన్నటి సనాతనధర్మోపన్యాసకుఁడు వంగిపోయినాడుసుమా. అందరు నీకే shouts యిచ్చినారు.

రావు—Yes. Cannot but.

లీల—మనబోటి Civilised people, సంఘసంస్కారణ మొనర్చుచు సంఘమునకు నూతనోత్తేజ మొసంగుచుండ, కలికాలస్వరూపుల మని నిందించె నేమి ? ఈ 20th. Century యందుగూడ శ్రుతిస్మృతులు మనకుఁ బ్రమాణములా? Men will rangle for religion, write for it, fight for it, die for it, any thing but live for it. In a Calm sea every one is a pilot.

రావు—English education లేని Bruits కే శ్రుతిస్మృతులు ప్రమాణములు కోహితద్వేద యద్వ్యముష్మిన్ లోకే ౨ స్తివాన వేతి, పరలోక మున్నదనిగాని లేదనిగాని యెవరికిఁ దెలియునని వేదమే యొత్తుకొనుచుండ శ్రుతిస్మృతులు ప్రమాణములా ? సభలో వకీలురావు లేడనుకొనినాడు కాబోలు. (మీసము దువ్వును)

లీల—రావ్ ! మనకి present birth లో ననుష్ఠింపఁదగిన ధర్మ మెద్ది ?

రావు—రాజానుమతమే మనకు బ్రథమధర్మము. తరువాత మనకేదియిష్ట మాయదియే మన మనుష్ఠింపఁదగిన ముఖ్యధర్మము.

లీల—రావ్ ! మన Educated Civilised people కి పాపమని యున్నదా ?

రావు—శరీరము నశించిన తర్వాత నాత్మకుఁ గర్మయుఁ బ్రాణికిఁ బునర్జన్మము లేదు. మనము యథేచ్ఛఁగా ధనార్జనముకొఱకు, భోగముకొఱకు నెట్టి పనినైన నిరాటంకముగా బాహాటముగ ఢంకామీఁద దెబ్బఁగొట్టి చేయవచ్చునని మా మెజారిటీ యభిప్రాయము.

లీల—రావ్ ? పాపకార్యములఁ జేయరాదని సనాతనిస్టు వాదించు టెందులకు ?

రావు—Nonsence. కర్రపీడివాదన కర్థమేమిటి ? అట్లయినచో యజ్ఞయాగాదులు మానవలయు.

లీల—Why brother ?

రావు—"మాహింస్యాత్సర్వభూతాని" యని వారు చెప్పుకొనిన వేదమే జంతుహింసను నిషేధించుచున్నది. పశువధ లేనిదే యజ్ఞమే జరుగదు.

లీల—యజ్ఞమువల్లనే స్వర్గము వచ్చునను నమ్మిక ముండిన, ద్వైతులవలె మనవారు పిష్టపశువధ మొనర్పఁ గూడదా ?

రావు—ఈ యద్వైతసిద్ధాంతముల కర్థమేమిటి ? Nonsence.

లీల—బలాత్కారముగ జేయుపను లెల్లపాపములని మనుస్మృతిలో వ్రాసినాడట.

రావు—Bad Company వల్లఁ జెడిపోవుచున్న వానినిఁ బట్టుపట్టి Good Company కి బలాత్కారముగ లాగికొని వచ్చిన పాపమా. Damit! Most improbable theory బలాత్కారము లేనిదే యెవ్వఁడు వచ్చియడు. Arrest warrants కే దిక్కులేదు. దిక్కుమాలిన శాస్త్రములు. ఒకదానికొకదానికి Common opinion లేదు. వేద మటు నిటుగూడ జెప్పును. Stability లేదు. నేను అని యనుకొనెడు శరీరము స్మశానమునఁ దగులబడుచున్నపుడు పరదారధనాపహరణమునకుఁ బాపమేమిటి ! Reasonకి వారివాదమేదియు stand గాదు. Manu is the biggest oldest brainless fool.

లీల—The greatest scholars are not always the wisest men. తద్దినములు పెట్టకపోయిన పితృదేవతలకు గతు లుండవని చెప్పెనేమిటి ?

రావు—Stupidity చచ్చిపోయినవాడు మరల నింకొకచోటఁ బుట్టి పెరుగుచుండునా. 2 గంటలవరకు మనల మాడ్చిచంపి, బ్రాహ్మణుఁ డిచటఁ బొట్టపొయ్యఁ దినిన, మృతుఁ డచ్చట భుజించి తృప్తిపడునా ? మనవారికి Commonsenceకనుపింపదేమి ?

లీల—The fickle mob how they are driven round by every wind that blows రావ్ ! పురాణము లెంతవరకు విశ్వసనీయములు.

రావు—మన కన్ని కులములు పుట్టించి, జాతికి దేశమునకు ననర్థకము దెచ్చిపెట్టిన వీ పురాణములే. మత్స్యపురాణము చేప చెప్పినది. కూర్మపురాణము తాబేలు చెప్పినది. వరాహపురాణము పంది చెప్పినది. తిర్యగ్జంతువుల యభిప్రాయములా మనబోటి civilised educated people కి ప్రమాణములు. వ్యాసుఁడు వ్రాసినాఁడా? B. C. Poet. ఆ వ్రాతశ్రుతులు, నా ప్రాంతస్మృతులు ప్రకృతకాలమున మనకొంటులకుఁ బనికిరావు. ప్రకృతకాలపరిస్థితులనుబట్టి మనము new social laws frame చేసుకొనవలసియున్నది.

లీల—Quite right. We have just enough religion to make us hate but not enough to make us love another. Brother మన జీవితముల పరమావధి?

రావు—Educate అయి, మోసము, నస్తృతము principle గా చేసుకొని ప్రశస్తముగ డబ్బు సంపాదించుకొని beautiful buildings కట్టించుకొని, western life enjoy చేయుచు, పాప మనుశబ్దము స్వప్నముననైన స్మరింపక స్వేచ్ఛగ నభీప్సితభోగంబుల ననుభవించి, చచ్చిపోవలయును. దేవుఁడూనై గురువూనై. This is our main object.

లీల—(ఆనందమున) Quite so. రావ్' బారులో బనికి రాకపోయినను. సంఘసంస్కరణమునందు నీ తెలివితేట లద్వితీయములు.

రావు—(తలయూచి)

సీ. విధవాంగనకుఁ బెండ్లి విధియని తమ విధ
వ కుమార్తె పెండ్లి సల్పంగరాదు
వ్యక్తురాల్గానికన్యకుఁ బెండ్లి తగదని
చిన్నపిల్లకుఁ బెండ్లి సేయవలయు
కులవిచక్షణలేక కుడుచుటొప్పగునని
కలశూన్యతో నింటఁ గుడువరాదు
బ్రహ్మమతావలంబకశిరోమణినని
యింట పూజలకు నోరెత్తరాదు

గీ. పై నటనవేరు హృదయ భావంబు వేరు
పలుకఁబడి వేరు చేసెడు పనులు వేరు
ఆత్మలాభాను సరణ కార్యప్రపంచ
సర్గచతురాననుండు సంస్కర్త సినుమ.

(ఆలోచించి) మురళీధరుఁడు వచ్చినాఁడా?

లీల— మెయిలులో వచ్చినాడు.

రావు—మన మనుకొనిన ప్రకారము, నేను ముందుగ రుక్మిణి చెంత కరుగుచున్నాఁడను. మురళీధరుని నీ యత్తగారినిఁ దోడ్కొనిరమ్ము. (నిష్క్రమించును)

లీల—(ఆలోచించుచు మఱియొక వైపునకు నిష్క్రమించును).

(తెర నెత్తుటతోడనే రుక్మిణి పడుకగదిలో ప్రవేశము)

రుక్మి—(కూర్చుండి శ్రీకృష్ణకర్ణామృతమును చదువుచు మూసి పైచి క్రిందఁ బెట్టి చేతులుజోడించి)

సీ. అర్ఘ్యంబు నీకిదే యఖిలలోకారాధ్య
పాద్యంబు నీకిదే భక్తవరద
హారతియిదిగో! వేదాంత మార్గవిహార
తాంబూల మిదిగో సత్యస్వరూప
మధుపర్కమిదిగో! బ్రహ్మజ్ఞానగోచర
యుపహారమిదిగో మహోజ్వలాత్మ
సేవాంజలిదిగో! సంసృతిబంధన విదూర
యేటికోళ్లివిగో! త్రయీవిధేయ

గీ. యవ్యయానంద నవ్య సౌధాంతభాగ
భక్తికాంచన రచిత ప్రభాసమాన
హృదయ సింహాసనంబున నీశుఁడవయి
వెలుగునీమూర్తికిదె యభివందనంబు.

ఓదీనావనా? గోపాలకృష్ణా! ఆపదుద్ధారకా? త్రికరణశుద్ధిగ సత్యమే పల్కుదును. సత్యమే స్మరింతును. నీసత్యస్వరూపమే ధ్యానింతును. తండ్రీ! ఈ దీనురాలిపై నింకను దయరాదా? నాప్రాణభర్తను గన్నులకుఁ జూపింపవా? ఈకోడరికపు యమబాధ నెంతకాల మని భరింతును. వంటలక్కలచే బావిని ద్రోయించిరి. నదిం ద్రోయించిరి. గిరిపాతలఁ బెట్టించిరి. భర్తను కంటితోఁ జూడనీయరు. మాట్లాడనీయరు. ఒక్కసారి నాప్రాణనాథునిఁ గన్నులారఁ జూపి, యీపసుపుకుంకుమతో నాపెనిమిటిచేతులమీఁద నీసన్నిధిం జేర్చుకొనుము. కరుణాసింధూ! గోపాలకృష్ణా? గోవిందకృష్ణా? గోకులకృష్ణా? దిక్కుమాలిన దీనురాలను. నీవు దప్ప నాకిచ్చట నెవ్వరు దిక్కు.

(అని నిద్రించును)

[వకీలురావు ప్రవేశము]

రావు—(జేబులోని యుత్తరము దీసి రుక్మిణి ప్రక్కనున్న పుస్తకముననుంచి) (నిష్క్రమించును)

[యశోదమురళీధరులతో లీల ప్రవేశము]

రుక్మి—(నిదురలో) ఈ దుఃఖ మెంత కాల మని భరింతును. (అని పలువరించును)

లీల—నిద్దురలోనైన నానికిఁ బెనిమిటిగోడవ యవసరములేదు. (అని యేమియు నెఱుఁగనట్లు పుస్తకమునుదీసి యుత్తరముఁదీసి, చదివికొని తలపంకించును)

ముర—ఏమిటి యాకాగితము?

లీల—చదువుకొనుము. నీకే యర్థమగును. (అని యుత్తరమును జేతి కిచ్చును)

ముర—(చదివికొని కోపమున నాలోచించుచుండును)

లీల—అత్తయ్యా? మహాపతివ్రత, మీమనుమరాలి చర్యను జూచితిరా? చర్యలు బయలుపడకపోవు. ఎన్ని దాచగలను. ఎన్నాళ్ళని దాచఁగలను. అదిగో ఉపభర్తవ్రాసినప్రణయలేఖ.

యశో—(తెల్లబోయి చూచుచుండును)

రుక్మి—(దుస్స్వప్నభయంబునఁ దటాలునలేచి కంగారుతో నిటునటు జూచి) ప్రాణనాథా! ఎప్పుడు వచ్చితిరి? (అని లేచి దగ్గిర కేగును)

ముర—(కోపమున) నేనునీవలపుభర్తనుగాను. నన్నంటకుము. (అని త్రోచివైచును)

రుక్మి—(నిశ్చేష్టయై నిలుచును)

లీల—ఏమిప్రేమ? ఎంత నంగనాచివే. ఈయుత్తర మేమిటి? (అని యిచ్చును)

రుక్మి—(పుచ్చుకొని జూచి భయమున) అయ్యో? దైవమా? ఈయుత్తర మేమిటి? (యని బోరున దుఃఖించుచు)

శా. ధర్మాధర్మవిచారదృష్టి సకలాంతర్వ్యాపి లేదే, సతీ
ధర్మంబింతటి పాపదోషమా? సత్యంబిట్టి దూరస్థమే
మర్మస్థానంబున కింత వ్యథ గాదే? దోషాభిశాపక్రియా
నిర్మాణంబునకింత శక్తి గలదే? నిక్కంబుగా నక్కటీ.

యశో—(రుక్మిణిం గౌగిలించుకొని) ఏమంటివి మా యిల్లాలు మాయింట నెగ్గగలదా తల్లీ! మన మాటలనన్ని నాకెఱుఁగరు? ఏమనుకొన్నావు? ఏమనుకొనుము.

రుక్మి—(ఎక్కిళ్లచే మాటఁ జెప్పలేక దుఃఖించుచుండును)

లీల—(కోపమున మురళీధరునిఁజూచి) నావదినగారిచే, వంటలక్కచే, నానాబాధలు పెట్టించుచుంటివని వీధిలో నీయత్తగారి యల్లరి. ఇంట నీ భార్య చర్య యిది. ఆ యపనిందలకే విచారింపనా! ఈ యప్రతిష్ఠకే యేడ్వనా నాయనా? నీ భార్యను నీకొప్పగించితి. పెండ్లము నొంచుకొనఁజాలని చవటవైన నీభార్యను దీసికొని నాయింటనుండి లేచిపొమ్ము. అబ్బా! ఈ యప్రతిష్ఠను నేను భరింపలేను నాయనా!

ముర—రుక్మిణీ! నీబాహ్యనటనముచే నిక్కముగ మోసపోయితిఁజుమా.

లీల—(తల నూచును)

రుక్మి—(బోరున దుఃఖించుచు)

ఉ. ఆ పరమేశ్వరుం డొకఁడె యన్నియుఁ జూచుచునున్న సాక్షి యే
పాపమెఱుంగ, నిన్ను బెడబాపుట కీనెపముల్ ఘటించి నా
కాపుర మీవిధానమున గంగనుగల్పి, భవద్వియోగ సం
తాపధనంజయార్చులను దగ్ధొనర్పఁదలంచె మత్పతీ!

లీల—(కోపమున) ఎంతకైనఁ దగిన జంతవే.

ముర—

శా. ప్రత్యక్షంబును దాపనెంచి తరుణీ వాపోవుచున్నావు, వై
యాత్యాచారములన్ గ్రహించితిని, సత్యాసత్యముల్గంటి నీ
యత్యుక్తుల్విరమింపు నాజనని నీకన్యాయ్యమూహించి దాం
పత్యంబు న్విడఁబాపఁ బన్నె నన నమ్మన్ నీవు వేజెప్పినన్.

లీల—(సంతోషమునఁ జూచుచుండును)

రుక్మి—(బోరన దుఃఖించుచు) ప్రాణనాథా! ప్రాణనాథా! సామకౌటుపతి తల్లి వాగ్విష మెంతలో నీబుద్ధిని మరల్చినది! కౌపురమునకు వచ్చినదాది, నన్నే స్వర్గంబుగఁ దలఁచి, నామాటనే వరాలమూటగ నెంచి యల్లారు ముద్దుగఁ జూచు సుప్రణయార్ద్రహృదయ మెంతలో కఠినపాషాణసదృశ మైనది! క్షణక్షణానందనిస్యందితంబగు నామాట యెంతలో నిందాగర్భిత మైనది! ఎప్పుడు వత్తువో, ఎప్పుడు వత్తువో యని కండ్లు గాయలుగాయ నీ కొర కెదురుచూచుచున్న నాకెట్టి ముప్పు వాటిల్లినది! అయ్యయ్యో! ఇఁక నేనేమిసేతును? ఎట్టి ప్రపంచాక మైనది! ఎట్టి దుష్కాలమొదవినది?

సీ. స్తవనీయులౌ హరిశ్చంద్రాది నృపులతో
సత్యమను శబ్దంబు సమసిపోయె
ధర్మరాజాదులౌ ధాత్రీపతులతోడ
ధర్మమను వచనంబు తరలిపోయె
ఘనతపోధనులైన మన ఋషీంద్రులతోడ
విజ్ఞానతేజంబు వెడలిపోయె
పరమార్థగములౌ ద్వాపరజనులతో
పాపభయంబెల్లఁ బారిపోయె

గీ. అక్రమ మధర్మ మనృత మనార్జవంబు
దుష్ప్రవర్తన దుర్మార్గ దురితచింత
నిండిపోయె జగంబున నిశ్చయముగఁ
జూడ నాబోటులకు నిల్వ నీడగలదె.

లీల—(కోపమున మురళీధరునిఁ జూచి) గ్రుడ్లనొప్పగించి చూచెద వేమిరా?

మ.ర—(రుక్మిణిం జూచి) తప్పుగప్పికొన నాకండ్ల దుమ్ముఁజల్ల యత్నింతువేమి?

రుక్మి—(దుఃఖించుచు)

మ. అకటా! యేమని విన్నవింపుదును నాథా! నాకు నీకంటె ది
క్కిక నెవ్వారు? మృషాపవాదమునకే నేనుందు, నే దోషపా
తుకనో పూతచరిత్రనో యెఱుఁగవో దోషైకతంత్రంబుఁబూ
ర్ణకృపాదృష్టి విమర్శఁజేసి యనదన్ రక్షింపవే ప్రోవవే.

(యనిభర్తృపాదంబులమీఁదఁ బడఁబోవును)

లీల__(రుక్మిణి నావలకుం ద్రోసివైచును)

ముర__(రుక్మిణితో) నీ వగలింక జాలింపుము. రైలు దిగి యతాత్తుగ నిప్పుడగదా వచ్చితి. అత్తల కెనురుపన్నుట కోడండ్ర నైజము.

లీల__ఇది యింత జగజ్జంతయని యెన్నడు దలంపలేమురా? నాయనా?

రుక్మి__(బోరున దుఃఖించుచు)

గీ. మూఢురాండ్రగు కోడండ్రు భువినిగలరు
ధనికురాండ్రగు నత్తలు ధరణిగలరు
యింత ఘోరంబుగలదె యేయింటనైన
పాప మీరీతి మాపాలఁబండెగాని.

యశో__(లీలతో కోపమున) భార్యాభర్తల నెడబాపి యెంత యుసురు బోసుకొనుచుంటివే. మాయిల్లాండ్ర యుసురు కట్టికుడుపక పోదే. నీవంటి యత్తలు బ్రతికియుండఁగా కోడండ్రకాపురములు సుస్టుపడవే. అయ్యో! నాకొంప కెట్టి యపకీర్తిఁ దెచ్చుచుంటివే.

లీల__(రుక్మిణిం జూచి) ముక్కుముంగర మొదలు నగలన్నియుఁదీసి ముందిచ్చుట బెట్టుము. ఇచ్చుట కిష్టములేక నా యీరోదువు. (అని నగలెల్లఁ దానే యొలిచికొని మురళీధరునిఁ జూచి) ఆవలకు గెంటక యింకను నాలోచింతు వేమిరా?

ముర__(కోపమున) రుక్మిణీ! నాయింట నీవరగడియ యాగుటకు వీలులేదు. ఎచ్చటి కేగెదవో పొమ్ము.

రుక్మి__(దుఃఖించుచుండును)

ముర__(కోపమున) ఇంకను పోవా? (యని గెంటును)

రుక్మి__(క్రిందబడి దుఃఖించుచు)

మ. భవదాశ్లేషమునందు గాత్రము, భవద్వాక్యంబులం గర్ణముల్
భవదాస్యంబున నేత్రయుగ్మము, భవత్పాదంబులన్ దృష్టియున్
భవదాకారమునందు చిత్తముగదా ప్రాణప్రియా! నాకహ
ర్దివ మీతుచ్ఛతరాభిశాపహృదయోద్వేగంబుఁ బాపంగదే.

(యని బోరున దుఃఖించుచు లేచి) ప్రాణనాథా! (యని నమస్కరించి లీలం జూచి) అత్తయ్యా! సెలవు. (అని చటాలున యశోదం గౌగిలించుకొని) అమ్మమ్మా! నాకాపురము పడిపోయినది. మీకందరకు దూరమైపోవుచున్నదాన.

యశో—(దుఃఖించుచుఁ గౌగిలించుకొని) అమ్మా! దుఃఖింపకుము. నేను బ్రతికి యుంటినా, నీకాపురము సుస్థిరపడక పోదు. (అని రహస్యముగ) సుబ్బమ్మ నంపు తోడుగ నిచ్చెద. పుట్టినింటి కేగుముతల్లీ!

రుక్మి—(భర్తం జూచుచు నిష్క్రమించుచు) నాథా! నాథా! సెలవా? సెలవా!
(అని నిష్క్రమించును)

లీల—(మురళీధరుని జూచి)

గీ. ఆంగ్లవిద్యావివేకరహస్యభూమి
ప్రకృతి నవనాగరికతా ప్రభావచరిత
ప్రణయమధుపూర్ణ మోహనప్రసవవల్లి
నీకుఁ బెండిలిసేతుఁ దండ్రీ క్షణమున.

మగవాడు మల్లెపువ్వు. ఎన్ని పెండ్లిండ్లయినఁ జేసుకొనవచ్చును. మీ సిగ పూవుఁ దుంచువా రెవరు? అందులో మన మైశ్వర్యవంతులము. మనమందర నోరెత్తువా రెవరు? శనివదలినది. ఏడ్చినచో మహోవత్తి గిరగిరఁద్రిప్పి పార వేయుదము. మనకు లెక్కేమిటి!

(తెరలో బిగ్గరగ కేక) అమ్మగారూ? ముందుకొర కెవ్వరో వచ్చినారు.

లీల—(వినుచు) ఆఁ. వచ్చుచున్నాను. (అని నిష్క్రమించుచుఁ దనలో) వియ్యపురాలి మీఁది కసితీఱినది. నాకుఁ గావలసిన దదియే. (యని నిష్క్రమించును)

ముర—(విచారమున నాలోచించుచుండును)

యశో—(ఇటునటుఁ జూచి) వెళ్ళినదియా? (యని మురళీధరునితో) నాయనా! నీవు నాచిన్న కొడుకుకుమారుఁడవు. నాకు మనుమఁడవు. ఈచిలుకతల్లికి దత్తుఁడవు.

ముర—దత్తతల్లి తల్లిగాదనెదవా?

యశో—(తెల్లబోయి యిటునటుఁ జూచి) అదిగాదురా! (యని యేమియో చెప్ప బోవును)

ముర—ఆదత్తహోమమేమిటి? ఆమంత్రార్థము లేమిటి? శాస్త్రధర్మదృష్టిచే నామె నాకుఁ దల్లి.

సీ. పావనంబగు మాతృపదపూజయుండంగ
దేవాలయములకుఁ బోవనేల
జనకపవిత్రపత్క్షాళనోదకముండ
తీర్థయాత్రార్థమై తిరుగనేల
యిహపరంబిడు జనయిత్రిపూజనముండ
దేవతార్చనలపై దృష్టియేల
శుభఫలార్థదమౌ ప్రసూనిదేశంబుండ
నపవర్గచింతనాయాసమేల.

గీ. సతత మాత్రభివందన వ్రతముయుండ
దానధర్మాధ్వరములపై తలపులేల
అవధిఁబడి తెచ్చి పెంచినయమ్మయుండ
సుతునకుం గొల్వ నితరదైవతములేల.

యశో — దత్తతల్లినిఁ గన్నతల్లివలె గౌరవించుట యెట్టి సుగుణవంతునకులక్షణమే గాని, పతివ్రత యగు భార్యను తల్లిమాటనమ్మి యింటినుండి గెంటివైచుట మాత్రము, మహాదోషకార్యమురా నాయనా!

ముర — (బొమలుముడుచుకొని పెడమొగము పెట్టుకొనును)

యశో — (మురళీధరునిఁ జూచుచు) నాయనా! నాబోటి ముసలిదానిమాటలు మీకు రుచింపవు. మానోళ్ళూరుకోనవు. పెండ్లము విషముఁబెట్టినదని, వ్యభిచరించినదని మిషబెట్టి తల్లులు చెప్పిన నల్లల్ల శరభా యని యగ్నిసాక్షిగ వివాహమాడిన ధర్మపత్నుల నావలకు గెంటవలసినదే? భార్యయనిన గొడుగుపై బిళ్ళయుఁ, గాలి జోడు ననియా మీయభిప్రాయము. మేము పురుషులమధికారమున్నదను గర్వమా, ధనవంతులము నోటికివచ్చినట్లు చెప్పినఁ జెల్లునను ధైర్యమా. మీవలెనే మీభార్యలు గర్భమునఁ బుట్టిపెరిగిరి. నితల్లి నట్టింటికెట్లువచ్చినదో, నిభార్యయు నట్లనే వచ్చినది. ఇంటిగుట్టు రెండవ చెవినిఁ బడకుండ నిద్దఱికిం దగిన గౌరవమిచ్చుచు సంబాళించుకొనఁజాలని యబ్బాయిలకుఁ బెండ్లిండ్లేలరా నాయనా? ఆత్మస్వాతంత్ర్యము, న్యాయాన్యాయపరిజ్ఞానము లేనప్పుడీజన్మముల ఫలిత మేమిరా? ఇంత

మంది జనమున్నారు. సర్వవిషయముల నచ్చినభార్య యేపురుషునకు దొరికినదో యన్నివిషయముల నచ్చినపెనిమిటి యేస్త్రీకి దొరికినాఁడో, రహస్యముగ నడిగి చూడుము.

సీ. సరసురాలికి నట్టిచవట దాపురమౌను
వయసులాడికి ముదివఱఁతుక దొరుకు
గుణవంతురాలికిఁ గుటిలుండు సిద్ధించు
మోహనాంగికిఁ గొండ్రముచ్చు నచ్చు
శాంతురాలికిఁ దామసపుగరాసు లభించు
సుతకృశాంగికిఁ గబంధుండు సేరు
జ్ఞానికొక్కెడ శుద్ధజడుఁ డమరును మఱి
వతికి రోగిష్టుఁడు ప్రాప్తమౌను

గీ. ఒప్పైననుకూల దాంపత్య మొసఁగనట్టి
బ్రహ్మ యుపహాసదుర్బుద్ధి ఫలమొ లేక
పాపమగుదొంటి వీరి పూజాఫలంబొ
యిలఁ గులస్త్రీల ప్రారబ్ధమేమొ! యకట!

ఇంతయే పెట్టి పుట్టితిమని లోకమునకు జంకి, పరువు మర్యాదలకు వెఱచి యెట్లనో సరిపెట్టుకొని గృహస్థులు సంసారయాత్ర సాగించుకొనుచున్నారు. ఇంత ఘోర మెచ్చటను జూడలేమురా నాయనా! ఇంత పాప మెచ్చటను వండిపోలేమురా బాబూ! భార్య పనికిరానప్పుడు వేరాలాడి, పోసికొనిన కట్నలాంఛనములు పనికివచ్చునుగాబోలు? నగలొలిచుకొని గెంటుమురా? మీయబ్బసొమ్మా? పరువుమర్యాదలు జూడని పశువులకు డబ్బే పావనము. వదలిపెట్టినను మనోవర్తియైన వచ్చునని వాంఛించు మానాభిమానశూన్యులు, కక్కిన కూటికి కొడఁబడు గృహస్థులుఁ బిల్లమీఁదఁ బిల్లనిచ్చుటకు సిద్ధముగ నుందురు. మఱల వివాహమాడెదరు మీకేమి? క్రొత్తపెండ్లము, క్రొత్త ముచ్చట్లు. నాయనా! చిరకాలజీవులై, భూమిమీఁద నుట్టగట్టుకొని యూఁగదరురా. ఈమూన్నాళ్లముచ్చటలో, భార్యలను దుఃఖపెట్టి యపకీర్తిపడి, యిహపరదూరులమగు వెంపులకను జ్ఞానము మీకుండదు. ఔను, అన్నివిధ

ముల నాడుపిల్లల కవస్థగాని, మీకేమినాయనా? విధవలుగాక, ముత్తైదువలుగాక, స్వాములవార్ల భార్యలవలె, మీజీవములకుసూరుమన్నుచు, బ్రతికియున్నంత కాలముఁ, బుట్టినిండ్లఁబడి మీభార్యలేడ్చుచుందురు. ఈయాడుపిల్లలపెండ్లిండ్ల కోసమాస్తులనమ్మికొని, ఫకీరులై, యీయాడుపిల్లలనింటబెట్టుకొనియత్తమామలు దిగకుళ్లుచుందురు. మీకేమి! అనుగ్రహమువచ్చిన మనోవర్తి పారవైచెదరు, లేకున్న వ్యతిరేకవాదన. పాపమా పుణ్యమా? మీదావాలను జూచి, మీ వాదనలఁ జూచి, వకీళ్ళు వెనుకనుండి నవ్వుకొనుచున్నారురా! ప్రజలు దూషించుచున్నారురా! బంధువులు మొగముల నుమియుచున్నారురా! అయ్యయ్యో!

సీ. అడిగిన ద్రవ్యమీయక యున్న నత్తింట
నాలినివిడుచు చండాలుఁ డొకఁడు
అరసంచి గదిలోని కందీయకున్నచో
నిద్రింపనీడు దరిద్రుఁ డొకఁడు
అత్తింటిపగను జూలాలినాలింద్రోలి
తనబిడ్డగాడను ద్రాబయొకఁడు
ఎకరమీయక నాలినేలఁ బెండ్లినొనర్చు
కొండని బెదిరించు క్రోతి యొకఁడు
గీ. పయ్యసులమీది కోప మివ్విధులఁ జూపు
అమ్మనాన్నయుఁ జెప్పిన ట్లాడుచుండ్రి
చదివినారు బియ్యే, యెమ్మె సదువు లెందు
కేడ్వనా లోక విజ్ఞాన మెడలినపుడు.

(కోపమున నిష్క్రమించుచు) ఈబుల్లినాయనలకు గడియ గడియకు వివాహమే గడియగడియకు క్యాంపుకాచే. (యని నిష్క్రమించును)

మురా— (ఆలోచించి తల నూచి లేచి మెల్లగ నిష్క్రమించును)

## ద్వితీయరంగము.

[లీల మందిరము. మురళీధరుఁడు ప్రవేశము]

ముర—(విచారముగ)

మ. భగవద్దత్తధనంబుతో గృహముసన్ భార్యాసుఖోపేతుఁడై
తగవుల్లేక ప్రశాంతవృత్తి దినముల్ దాటించు భవ్యద్వయా
త్మిగుఁడే సూ చరితార్థజన్ముఁడు. ధరిత్రిన్గాని గేహంబె దే
వగణప్రీణిత మవ్వయు ప్రమదశోభాస్థానమూహింపఁగన్.

Domestic happiness is the end of all our pursuits and the common reward of all our pains. (ఆలోచించి తల నూచి) సంసార సుఖము నేను పెట్టిపుట్టలేమకాబోలు! లేకున్న మఱల నాతల్లి పట్టుఁబట్టి యీరెండవ వివాహ మేల యొనర్చినది? (ఆలోచించి) Enlightend, up to date views గల Educated girl కావలయునని ముచ్చటపడి వెతకి వెతకి తీసికొనివచ్చి వివాహ మొనర్చినది. ఆమె యాజ్ఞ శిరసావహించుట నా విధ్యుక్తధర్మము. కాని యీరెండవభార్య యిట్లున్నదేమి? మూఢురాలుగాదు, Inter చదువుకొనుచున్న విద్యావతి. (ఆలోచించి) అత్తగారనిన నణఁకువ, భర్త యనిన భయభక్తులు గనుపింపవేమి? ఇది విద్యాఫలితమా? Education నెన్నఁడు దూషింపరాదు. ఆంగ్లవిద్య స్త్రీలకు స్వాతంత్ర్య జీవనోపాధి గల్పించి, యాదర్శప్రాయులఁ జేయుచున్నది. (ఆలోచించి) ఈదుర్గుణము లేల యలవడినవి (ఆలోచించి) పరిష్కృతవిద్య స్వమతకులాచార ధర్మముల నేర్పి, నైసర్గికభావనిర్మాణ మొనరింపఁజాలకున్నది. అందువల్లనే, మనోవృత్తికిఁ జదువుకొనిన చదువునకు సంబంధ మగుపడదు, పై డ్రెస్సు వేరు. మనోవృత్తి వేరు. విద్యాధిక్యతనుబట్టి status నుబట్టి, గౌరవ ముద యించినను, పరిచయము గలుగుట తడవుగఁ బరమాసహ్యత జనించుచున్నది. Honesty, Sincerety యగుపింపదు, వకీలుఁ రావే నిదర్శనము. No villain like the concientious pillain. (ఆలోచించి) Educated class లో meanness ఏల యుదయించినది? స్వమతకులాచారధర్మముల విడిచి పరదేశీయాచారధర్మముల Imitate చేయుటచేతనే యీస్వభావము లేర్పడినవి.

(ఆలోచించి) జీవనోపాధికొఱకు కన్యావిద్య నేర్చికొని సంబళమాత్రమున నిజ పతులాజ్ఞాకర్మముల విడుచుట యగునా? (ఆలోచించి) కూడదు. కూడదు. ఏల imitate చేయుచున్నాము? సంఘదౌర్భాగ్యత. slavish mentality. ఆంధ్రులు Imitators.

[లీల ప్రవేశము]

లీల—(మురళీధరుని పరికించి చూచుచు వచ్చి) నాయనా? What's the matter with you? Electric Current వలె active గ నుండెడివారు నా ఆహర్నిశము చింతాలోచన మేమిటి? నీకేమి లోటు?

ముర—(విచారము) అదృష్టమే లోటు.

లీల—(ఆలోచించి) ఈ New wife నకు విధేయురాలుగ లేదను విచారమా?

ముర—(విచారమున) కాదు. నాగృహనాటకరంగమున నాపాత్ర కెట్టి యనౌచిత్యము పైబడినదను విచారము,

లీల—ఈగృహకల్లోలము చే నీకేగాదు, నాకును మతిపోవుచున్నది. దానిపట్టుదలయే దానిదిగాని, చెప్పినట్లు వినదు. కాలేజీకి వెళ్లితీరవలయునట. డబ్బుకావల యునట. ప్రయాణప్రయత్నము మీందనే యున్నది. మాటాడిన, మీందబడి పోవుచున్నది. కోరికోరి కొఱవినిం దెచ్చుకొంటి నేమిరా నాయనా?

[మురళీధరుని ద్వితీయభార్య సుందరి కండ్లకుం గాళ్లకు జోళ్ళు దొడిగికొని, యెడమ చేత బుస్తకము బుచ్చుకొని, దొరసాని వేషముతో కుడిచేత బ్యాటు త్రిప్పికొనుచుం బ్రవేశము]

సుంద—Well, Madam! నా marriage యీ vacation లో వచ్చినది గనుక సరిపోయినది లేకున్న నాకు Attendence చాలదు. రేపు College Re-Opening. Morning mail న కేగితీరవలయును.

లీల—(బొమలుముడిచికొని) వివాహితయైన యాడుపిల్లకు Education అవసరములేదు

సుంద—Mother-in-law does-not remember she was once a daughter-in law. మీవలెనే, నేనును Doctry bass ఆయి Public life enjoy చేయ వలయునని నాయభిలాష. చదువు మానుకొమ్మని నిర్బంధించుట మీబోటి educated people కి తగదు. నేను బి. యే. ప్యాసగువరకు, చదువక మానను. మా uncle వకీలురావుతో ఏ Condition చెప్పియే యీ Marriage చేసుకొంటిని.

ముర___(భార్యనుఁ జూచుచు)

గీ. నిత్యజీవనమున గృహకృత్యమందు
భర్తృసాహాయ్యమునకుఁ దోడ్పడఁగజాలు
నాంగ్లజాతీయవిద్య కన్యలకుజాలు
ప్యాసుజేసితి పింటన్ సెబాసు చాలు.

సుంద___(పరిహాసముగ) ఈ 20th century లో నిటువంటి యభిప్రాయములు గల Graduate ఉండడని నానమ్మకము. పురుషులతో సమానమగు Status కావలయుననిన స్త్రీలకు College education ఉండితీరవలయును. లేకున్న Freternity, equality and liberty పూర్తిగా Hindu ladies కి రావు

లీల___(కోపమున) Equality కర్థము నిర్లజ్యము, పెంకితనముగాబోలు.

సుంద___అది స్త్రీ స్వభావము. దానికి దీనికి సంబంధ మేమిటి ?

లీల___(కోపమున) ఏమిటీ స్వాతంత్ర్యము ?

సుంద___That's the liberty every educated woman demands.

లీల___(కోపమున) ఇట్టి స్వాతంత్ర్యమా మేము కోరుచున్నది?

సుంద___ఆస్వాతంత్ర్య భేదము మీబోటి మహిళాభిషజ్ఞులకుఁ దెలియునుగాని, విద్యాభ్యాసమొనర్చుచున్న మాబోటి యువతుల కెట్లు తెలియును ? Well, Madam? పట్నమున నాకు సొంత ఖర్చు బాపతు 200 ల రూప్యముల ఋణముగలదు.

గీ. ఆతతాయుల, చేకత్తి కోతకంటె
నదనచరదుస్సహానలజ్వాలకంటె
ప్రాణపవనోద్గమోద్భూత బాధకంటె
బాధకరము ప్రజాఋణబాధ తలఁప.

You know debt is the worst kind of poverty. Pressure ఎక్కు-వగనున్నది. Please make it ready.

ముర___(ఆశ్చర్యమున) సుందరీ ! నీకు రు 200 ల యప్పు గలదా ?

సుంద___Husbands wonder why their wives are so expensive, wives wonderr why their husbands are so pensive.

ముర___(తలనూచి భార్యం జూచి)

గీ. శాంతము హుళక్కి స్వేచ్ఛ మత్సరము ఘనము
తామసము హెచ్చు తొందర దారుణంబు
భావిఫలచింతనంబు నిష్ప్రచ్చరంబు
చదువునేర్చిన యిటువంటి చానకరయ.

సుంద—అమ్మపోలికయే భార్యకు వచ్చినది. తప్పులేదు.

మురా—(లీలం జూచి) అమ్మా! ఇంత civilised independant views గల భార్యను భరించుట కష్టము, కష్టతరము, కష్టతమమును.

లీల—(విచారమున) నాయనా! అందరు నిట్లనే యుండిరా? ఇదియొక Type నాపాపమే యిట్లుపండినది. భయములేదు, భక్తియులేదు. (కోడలినిం జూచి కోపమున) భర్తకుం బనులు పురమాయించుట. నీయుద్దేశమున భర్తయనఁగా నాకరనుకొంటివిగాబోలు.

సుంద—An obedient lovely wife commands her husband తప్పా? నా నోసటనే బ్రాహ్మవ్రాడిచినదియా?

సీ. గ్రాడ్యుయేటైనట్టి కనకమ్మప్రియభర్త
ప్రతిదినం బిడ్డినుష్మాలఁదెచ్చు
యఫ్యొల్జదివినట్టి యంబికానాధుండు
తలదువ్వి సిగజుట్టి తిలకముంచు
బియ్యేలునకుఁ జిన్న వెంకాయిపెనిమిటి
జెడయల్లి పూవులు ముడుచుచుండు
మెట్రిక్యాసయిన రాజేశ్వరీ హృదయేశుఁ
డనుదినంబును జెప్పు పనులుసేయు

గీ. కమలమగఁడెట్టి రాత్రిపంకాగ్రహించు
ప్రమదభర్తఁ డింట రింటను వంటసేయు
భర్తలాంద్రకుఁ దగ సాయపడుటకూడ
పరువు తక్కువె? సేవకత్వమొ? తలంప.

తానెట్టి మహోద్యోగియైనను, Europeon, ముందు wife ను గౌరవించి భార్యాజ్ఞానువర్తియై మెలంగుచుండుటలేదా? Graduates మని యుప్పొంగుటయేగాని, Western civilisation యొక్క యాచక్కని principles అర్థము గానంగుల కెంతయు విచారించుచున్నాను,

లీల—(కోపమున) Let not your tongue runaway with your brains నీవిక చదువుకొనవద్దు. నీకు దమ్మిడీ నియను Nonsence!.

ముర—There is sense in her sentences but the sum total is nonsence

సుంద—(లీలను జూచి) మీతో నాకు సంబంధములేదు. (అని భర్తం జూచి) మీ యుద్దేశ మేమి?

ముర—నాతల్లి యుద్దేశమే నాయుద్దేశము. ఇకం జనువంగూడదని నామతము.

సుంద—ఒకరియాజ్ఞానువర్తినినై యుండుట నామతము గాదు.

ముర—(వెలవెలబోయి చిఱునగవున) సరి. ఇంకేమి?

సుంద—(కోపమున) తల్లి యెట్లు సెప్పిన నట్లు గంగిరెద్దువలె తల నూచు Graduate నకు భార్యగ నుండుటకంటె, స్వతంత్రజీవనము మాబోంట్లకు సుఖదాయకము. ఓ. కే.

ముర—అమ్మా! నియఖిలాగ్నదీతీనదియా? నీవు కోరితెచ్చికొనిన, కోడలి, Up to date civilsied views గమనించితివా'

లీల—(అస్థైర్యమున నిట్టూర్పుంబుచ్చుచు) ఏమనను, అత్తగారిపోలికయే కోడలికి వచ్చినదని నాపటము నానెత్తినే గొట్టుచున్నది. దానినోటికి తలుపా ద్వారబంధమా? (యని కోడలిం జూచి కోపమున) మాయబ్బాయికి మళ్ళీ పెండ్లి జేసెద జాగ్రత్త!

సుంద—మీయబ్బాయికి మీరు మళ్ళీ పెండ్లిచేసినయెడల మఱల మేముమాత్ర మెందుకు మళ్ళీ పెండ్లి జేసుకొనగూడదు?

లీల—(కోపమున) భర్తనువదలిపెట్టిన యిట్టి రాలుగాయిని నెవరు పెండ్లి జేసుకొనునబ్బా?

సుంద—ఇద్దరుపెండ్లాముల వెడలగొట్టిన యిట్టి Bad coin న్ని పెండ్లి జేసుకొను స్త్రీరత్న మెవరమ్మా?

లీల—(కొడుకుం జూచి పులిమీదంబుట్ర. ఈకోడలు నాకెక్కడ సంప్రాప్తించినదిరా?

ముర—అమ్మా? కోరికోరి తెచ్చికొంటివిగదా?

సుంద—ఓ. కే. Well, Lady Docter, good bye! So called temporary husband fare well.

లీల—జీవితమున్నంతవరకు దుఃఖించెదవుసుమా. ఆనక మాయింట దాసిగా నుండెద నని కాళ్లమీదఁబడినను, గుమ్మ మెక్కనీయను. దూరదృష్టి నాలోచించుకొని జవా బిమ్ము. Haste is waste.

సుంద—(నిష్క్రమింపుచుఁ దనలో) ఈవిశాల విశ్వప్రపంచమున జనించిన ప్రతిప్రాణికి స్వాతంత్ర్యము జన్మహక్కు, మాతలిదండ్రులు కన్యాప్రదానవేళ మాతోపాటు మాజన్మహక్కగు స్వాతంత్ర్యమును గూడ ధారవోసిరా? మాయాత్మస్వాతంత్ర్యగౌరవములను మేముకళ్యాణవేదికలపై బలిపెట్టుటయా? అత్తింటి కోడండ్రమైనంతమాత్రమున మేము బానిసలమా?

సీ. శారదాచట్టంబు శౌరిచక్రముభంగి
కన్యలకు వెనువెంటఁ గాచువేళ
ఆంగ్లవిద్యాభ్యాస మనదలకు జీవ
నోపాధినూటిగాఁ జూపువేళ
అల వితంతూద్వాహ మతిదుఃఖజలధి త
పించుదీనలను రక్షించువేళ
స్త్రీసంఘముల నుద్ధరింప సంస్కర్తలు
స్థిరదీక్ష ధైర్యంబుఁ జెప్పువేళ
గీ. సేతుశీతనగాంతర భూతధాత్రి
స్వేచ్ఛ స్వేచ్ఛయటంచు ఘోషించువేళ
నాఁడు స్వాతంత్ర్యతేజం బణంపఁదలఁచు
వీరిఁ గన నవ్వు వచ్చెడు వింతరీతి.

ఓ విద్యాధికసోదర సోదరీమణులారా?

సీ. చేయ్యూనవిడియాకు చేట్టమేర్పడకున్న
మాదుఃఖముల కింక మరువుగలదె
తండ్రియాస్తిని మాకుఁ దగు హక్కు లేకున్న
నిట్టివేళలయం దికేదిదారి

ఆంగ్లేయవిద్య మే మభ్యసింపకయున్న
నీదాస్యదుఃఖాబ్ధి నీదఁగలమె
ఉద్యోగములను మేమూతఁగాఁగొనకున్న
నిట్టికాపురములం జేదితెరవు

గీ. పాసనఁపుఁబానిసలరీతిఁ బరగుకంటె
స్వేచ్ఛదారఁగి ధరిత్రి జీవించుకంటె
స్వచ్ఛశీలంబుతోఁ గులాచారసరణి
వదలక ంగన్యకలమాచు బ్రదుకఁదగదె.

ఓ. కే. (యని రివ్వున నిష్క్రమించును)

(విచారముసఁ దనలో)

గీ. ఉన్న దెల్లముఖఁబున నుచ్చరించు
గట్టివాయ యుపద్రవకారిగాడు
గుట్టుగనరాని నాల్క్రుచ్చు కొంపదీయు
శాంతరసనిమ్న గంభీర జలధిభంగి.

Selfish fellow. Row నాచే జల్లఁగ నెంతపని సేయించినాడు. ఇకెందు లకు? అతని మాయలో బడిపోయినాను. ఆహా?

గీ. ఎల్లవారికి శకునంబులెల్ల బలికి
బల్లి తాఁబోయి కుడితిలో బడినరీతి
నొకరినననేల తాఁజేసియున్న పనికి
వెనుకఁ జింతించు టెంతయు వెఱ్ఱిదనము.

అనునారోక్తినిశ్చయము. (తలపంకించి) All that glitters is not gold. బంగారమువంటి కోడలిని వెడలగొట్టి వజ్రమునుకొని గాజుపెంకును దెచ్చు కొంటిని. ఈనవనాగరికతా స్వరూప యారుక్మిణినే యుత్తము రాలని పించినది.

మురళీ—(స్వగతం) She is adorned amply that in her husbands eye looks lovely. The trust mirror that an honest wife can see her beauty in. A man's best fortune or his worst is his wife. A wife is the peculiar gift of heaven.

గీ. శాంతి గుణశాంతిశీలయౌ ధర్మపత్ని
యుక్కలిందీర్చునట్టి ప్రత్యక్షధనము
తలచి చూచిన నిహపార్థద్వయంబె
పురుషునకుఁ బ్రాణమిత్రురాలి భూతధాత్రి.

[డాక్టరు లతీఫు ప్రవేశము]

లతీ—Good morning లీలా! Good morning మురళీధర్. (అని యిరువురి ముఖములం జూచి) What's the matter? You look grave.

లీల—ఏమున్నది ? గృహచ్ఛిద్రము. వెళ్లినపని యేమైనది,

లతీ—మన మనుకొన్న మెంబర్లని చూచీవచ్చావ్ ?

లీల—ఆయారువోట్లు నీకుఁ దప్పక వచ్చితీరును. మాట తప్పరు. Promise చేసినారు.

లతీ—Promises లాబంలేదు. ఓటుకూ 2 వేలు యిప్పించడానికి వకీలురావు యేర్పాటుచేశాడు. ఎల్లాగో మాయచేసి వీరన్న కిప్పించేస్తాడు. 3 వేలు యిస్తామని వేలంపాట పెడ్తేగాని మనవేపున కసల్ తిరగరు.

లీల—Yes. అట్లనే చేయుము.

లతీ—(ఆలోచించి) ఈ Election Campaign కి 3 నెలల్ నుంచీయే జెంట్లకోసం మెంబర్ల కోసం, జల్సాల్ కింద మారువాడీల్ వద్ద అప్పుల్ తెచ్చి విరజల్లేశాను. నా ఆస్తికి తెచ్చిన ఋణాన్కి బరాబర్ అయిపోయింది. ఇంకా నాకుదమ్మిడీఋణం పుట్టడంలేదు. నన్ను మట్టి చేయాలని పంతంబట్టి వీరన్నను నాకు పోటీగా నిలబెట్టి మంటల్ మంటల్ పెంచి కొంపల్ కొంపల్ గూల్చిస్తూ, (పండ్లు పటపట గొరుకుచు కోపమున) ఆవిలన్ రావు Election యుద్ధంనడిపిస్తున్నాడు ఇన్ని వేలూ తగల్ బెట్టి మద్దెరంగింలో, యిప్పుడు, వెనక్కీడితే నలువురు నవ్వుతారు. ఏమి చెయ్యాలా?

లీల—(మురళింజూచి) నాయనా! మేనకోడలు సుందరిచే చదువుమాననిపించి, తృణాత్తు మున డబ్బడిగించి. మొగుడుత్రిప్పి, యింటనుండకుండజేసినాడు. మనము stand

చేయించిన యమాయకుండగు సెడాక్టరు లతీఫు నిప్పుడు గంగలో గల్పుటకు పద్మవ్యూహమం బన్నినాము. మనము తప్పక యీవకీలురావునకు శృంగభంగి మొనర్చితీరవలయును.

ముర—(రోషమునం దలనూచి) Doctor! We promise our help at any risk. Try earnestly.

లతీ—Thank you. (అని మురళీధరునికిమాత్రమే Shake hand నిచ్చును)

లీల—(చిఱునగవునం జూచుచు) డాక్టర్ !

గీ. రావు బేవురులు వీగన్న సభ్యపుతుల చిని
కాంగిరాసు మొన్నె నేర్పైన కన్నుపెట్టి
క్రీడరీతినిం దలపూవు వాడకుండ
నిన్ను ప్రెసిడెంటు సీటుపై నిల్పెదాన.

లతీ—(ఆనందమునం జూచుచు) Thank you very much.

లీల—మరచిపోయితిని. పంచముల తరఫు మెంబరు సూర్యారావు oat మాట యేమిటి ?

లతీ—ఏజెంటు నాగన్నను పంపించాను. రేపు మీవద్దకు తప్పక వస్తాడు. ఎంతో ఎంతో శ్రమపడ్డాను, అబ్బా! 2 వేలు యెక్కో యిస్తే తన ఓటు యిస్తానన్నాడు.

లీల—(తలనూచి యాలోచించుచు) మంచిది. కానిమ్ము.

లతీ—చీరో! Good bye. (అని నిష్క్రమించును)

(లీల మురళీధరులు నిష్క్రమింతురు)

# నవయుగము

## తృతీయాంకము

## ప్రథమరంగము.

(లీల మందిరము)

[నేషన్లిస్టు మెంబరు శాస్త్రి ప్రవేశము]

శాస్త్రి—(యాలోచించుచు) మహిళాభిషజ్మణి యింట నుండెనా, లేదా ?

[లీల ప్రవేశము]

శాస్త్రి—సోదరీ! నమస్తే.

లీల—Hullow! Nationlist member, good morning. వచ్చి యెంతసేపైనది?

శాస్త్రి—అమ్మా! ఇప్పుడే వచ్చితిని.

లీల —Take yor seat there.

శాస్త్రి—చిత్తము. (అని కుర్చీమీఁదఁ గూర్చుండును)

లీల—(కూర్చుండును)

(వంటలక్క టిఫెన్, కాఫీ, మేజాబల్లమీదనుంచి నిష్క్రమించును)

లీల—Kindly take coffee శాస్త్రీజీ.

శాస్త్రి—Oveltine తప్ప నాకు కాఫీ అలవాటు లేదు. క్షమింపుడు.

లీల—Election Campaign యెట్లున్నది ?

శాస్త్రి—అమ్మా! మహాప్రళయముగ నున్నది. ధనికు లందరు భస్మమైపోవుచున్నారు.

లీల—మన మంత్రు లీయెలెక్షనులఁగూడ నెత్తివేసినచో ప్రజలకుమహో పకారమొనర్చిన వారగుదురు.

శాస్త్రి—(సంశయమునఁ దల పంకించుచు) నిశ్చయమే.

లీల —British administration is the best and they are the capable gentlemen to administer. Europeans వలె Honesty Character, Nobility, self sacrifice మన యొద్ద లేదు. Election అగువరకు చేయరాని ప్రమాణములు, చెప్పరాని వాగ్దానములు. Elect అగుటతోడనే మహానుభావుడు వన్నెకు వచ్చెను. కన్నెత్తి చూడడు. స్వలాభము తప్ప మన Gentleman కింకొకటి లేదు. మన మహానుభావులా! ప్రజాసంస్థల నిర్వహించువారు! Hopeless.

శా. స్త్రి—అమ్మా! ఇందరు పుట్టుకతోడనే నేర్చుకొనలేరు. మీ యనుభవము మీద. క్రమక్రమముగ నాదర్శప్రాయు లయ్యెదరు. పోనిమ్మెటులైనా, మీ యోట్లెవరికీయ దలంచిరి?

లీల—మీ పార్టీ కసలే Strength చాలదు. తప్పదు. చాలదని పార్టీలకుగూడ నిలువ నివ్వరు. To whom I have to give?

శా. స్త్రి—Justice పార్టీ వీరన్నకు మాత్ర మీయవద్దని మా ప్రార్థన.

లీల—(ఆలోచించి) Municipal Chairman you mean!

శా. స్త్రి—ఎవరైన నేమి?

లీల—మీ పార్టీ Oats ఎవరికీయ నిశ్చయించుకొంటిరి?

శా. స్త్రి—ఇండిపెండెంటు పార్టీకి.

లీల—Doctor Latiff you mean. That's good. ఆతడుపకారశీలుడు, ఉదారహృదయుడు. సత్పురుషుడు. Very able man. నా ఓటును మీ యిష్టాను సార మతనికే యిచ్చెద.

శా. స్త్రి—మంచిది. అదియే మా కోరిక. అనుజ్ఞ.

లీల—(ఆలోచించి) మంచిది. వకీలురావుగారి నొకసారి రమ్మని చెప్పి వెళ్ళెదరా?

శా. స్త్రి—ఈసంగతిమొంగనే వార్లగాడు మన్నారు. ఇప్పుడే కలుసుకొని చెప్పి వెళ్లెద.

(నిష్క్రమించును)

లీల—Election politics లో నభిమానముంచుకొనిన లాభము లేదు. తంత్రమే ముఖ్యము. రావును త్రిప్పినా వీరన్న నిలువడు. Docter Latiff నెగ్గితీరును. దేవాంతకుడావకీలురావును త్రిప్పు టెట్లు? (ఆలోచించి) అతనికి డబ్బే ప్రధానము. He often changes his principles more than shirts.

[వకీలురావు ప్రవేశము]

రావు—(కోరచూపుతో నాలోచించుచు) Good morning. Docter Latiff సాహెబుగారికి Success sure.

లీల—నీకు భయపడి కబురుచేసితినని తలంపకుము. ఎవరి ప్రయత్నము లువారు చేసుకొనెదరు. దానికేమి?

రావు—(బొమలు ముడిచికొని యాలోచించి) Yes. పిలువనంపిన కారణము?

లీల—Openheart తో చెప్పుచున్నాను. ఎందుకు చెప్పుచుంటినో దూరదృష్టి నాలోచించుకొనుము.

రావు—ఏమిసేయుమనెదవు?

లీల—వీరన్నను ద్రిప్పివేయవలయును. That is my humble request.

రావు—ఇదియా నీకోరిక. మంచిది. కాని, ఈయెలక్షనులో నాకేమియు సంబంధము లేదు. లతీఫు వీరన్న లిద్దరు నాకు రెండు కండ్లు. నీవు నాసోదరివి. సర్వేజనాస్సుఖినోభవంతు. అయినను నేను చెప్పిన వీరన్న వినునా? పట్టుదలతో శివమాడుచున్న నాతని ద్రిప్పుట నాయొక్కనితో నున్నదా ప్రయత్నించెద.

లీల—ఈరెండువేలుఁ బుచ్చుకొమ్ము. (అని యిచ్చును) ఏదీ నామీద నొట్టుబెట్టుకొనుము.

రావు—(పుచ్చుకొని) అట్లనే. నీతోడు.

లీల—పట్టిమాట కొట్టుబెట్టుకొనుట దోషమని ఖురాన్ షరీఫ్ ఘోషించుచున్నది.

రావు—తప్పకుండఁ జేసెడు పని కొట్టుబెట్టుకొనిన తప్పు లేదని బైబిలు చెప్పుచున్నది.

గీ. వారిజాక్షులందు వైవాహికములందు
ప్రాణవిత్తమాన భంగమందు
చకితగోకులాగ్ర జన్మరక్షణమందు
బొంకవచ్చు నఘముబొందదధిప.

యని మాపంచమవేదము మాకు జెప్పుచున్నది. Election బొంకుల కసలే దోషములేదు. (ఆలోచించి) మీయింటిముంగటకు Car వచ్చిన దెందులకు?

లీల—నాకుఁ దెలియదు.

రావు—(తనలో) I see. అది Nationlist party car. (ప్రకాశముగ) లీలా! నీ profession నీవు చూచుకొనక నీకీ Election గొడవెందులకు? లతీఫు నీకు ప్రియమిత్రుడని నమ్ముచుంటివి. Dog wag its tail not so much in love to you as to your bread. Mind that. You will reap the Consequence.

లీల—(బొమలు ముడిచికొని) ఆగొడవ నీకెందులకు ? నాపని నాకుఁ జేసిపెట్టుము.
(అని పేపరు చూచుకొనుచుండును)

రావు—(తనలో కోపమున) ఎంతదాననైతివి ? త్రాచుబాముతో జెలగాటమాడుట కుంకించితివిగా ? ఏమి ! ఘనమహోన్మత్తత. నామేనగోడలు 200 ల రూప్యము లడిగిన నీయవా ? B. A. చదువుకొనిన డబ్బు కర్చగునని చదువుమాను కొమ్మందువా ? ఎన్నివేలైనను కర్చుపెట్టి డాక్టరు లతీఫును ప్రెశిడెంటు జేసెదవా ? (మీసము దువ్వుచు) నీయాస్తిగాను నీయొత్తుధనముబోసినను, వానిని ప్రెశిడెంటుఁ జేయుగలవేమో చూచెదగాక. ఎగుటినైపున వకీలురావు ప్రతిపక్షుఁడై కంకణము గట్టుకొని నిలిచియుండె నికుగాదు బ్రహ్మరుద్రాదులకుఁ దరముగాదని యెరుంగుదువుగాక. ఈరెండువేలకు ఫలిత మెదు రీమె వోటు నకై వీరన్న నీమెయొద్ద కంపెదగాక. (యని నిష్క్రమించును)

[చెయిర్మను వీరన్న గారు ప్రవేశము]

లీల—(ఆశ్చర్యమున) What is this? చేర్మన్ గారే వచ్చినా రెమిటి ? Good morning.

వీర—సౌబాగ్గెవొతీబవ!

లీల—(తనలో) సౌభాగ్యవతీభవ యేమిటి? Nonsence.

వీర—శ్రీయిద్దె కంపల్జరీసేసి, మీవొంటి సదువుకున్న ఆడోళ్ళకి ఉద్దోగాలిచ్చి, పెద్ద పెద్ద జీతాల్లోకి పెమోసను జేసి, శ్రీల్ని అబివిర్ధిలోకి తెచ్చిన సేరుమేన్ను నేను. సమగుడ్డో, అసమద్దుడో కరాకండీగా నిక్కచ్చిగా మోఁవాటం లేకుండా, నిప్పుల్లో ఒకకాలు, మంచిగెందంలో ఒకకాలూపెట్టి పెజల సేమంకోసం, కట్టపడేవోడానో కాదో, సూసి మరీ వోటియ్యాల. నేనెసుమంటోణ్ణో మీకు తెల్దా? పెపంచానికి బూసెక్రానికి తెల్దా?

సీ. కొవ్వునెయ్యి బజారుకొట్ల సాయిలికైన
　　సేరకుండగ నిల్పు సేసినాను
సీళ్ళుగల్సిన పాల నూళ్ళోకి రాకుండ
　　సిన్నలైన కాయిదా సేసినాను
కాపీవొటేళ్ళలో కల్తీపనులుసూసి
　　సిచ్చించి కరకట్టు సేసినాను
లాంతర్ల సిట్టము లాగేసి యీ వెల
　　ట్రిక్కు దీపాల పెట్టించినాను

గీ. పసులుగా తానుగోష్ఠ తెంచినాను
యీదులన్ మురిక్కికొట్టు మాయించినాను
పసుల పోషకార్థ యనస్త్రి బడిసినాను
సేరు మోస్తున్న యీనాన్ని సేరమేను.

సమయమువచ్చింది సాయంసేయాల.

లీల—(బొమలుముడుచుకొని) వచ్చినపని?

వీర—అనాయీబుకోసం నిస్కార్చంగా వచ్చేందుకు తగ బెట్టుకుంటావమ్మా ఎగ్రి తల్లీ! మీది నామనేనసునీటుగుండా! నామాటినండి. మీవోటల్లా నారయ్యండి. సంచులిస్తా. ఇదిగో దత్తు. అంతే. (అనినోట్లకట్టతీసి చూపించును)

లీల—(కోపమున) ఏవే సాల్వేంటువుగావు. డబ్బుకోరి కొనవడు పెంబరుడుగాను.

వీర—(తెల్లబోయి కంగారుతో బట్టయు పాగయు సర్దుకొని) ఇదేటి! ఆ రావుగోర్లా సెప్పేదేటి? అన్నా! సెడొచ్చిందే యేపారం! ఈయమ్మ వోటియ్యాకపోతే ఇంక నెగ్గనన్నమాటే. ఇంకేటి! గాశారం? ఆ రావుగోరి సేతులో యీ గడియవోరకు డుమ్మేసుగా 20 వేలోశాను. అంతసొమ్మూ డోకడా గొట్టిందన్నమాటే. తలుసుకుంటే గుండె గుబేలు మంటోంది.

లీల—ఇందుకొరకా రావుగారు నిన్నంపిరి? (తలనూచి) నా సలహా వినెదవా?

వీర—నిచ్చేపంలా. అంతకంటేనా! ఇంటాను సెప్పండి.

లీల—రావుగారి గాలి, చూపు, దగిలినంతమేర? హాలాహలజ్వాల లుదయించి పచ్చని కొంపలు భస్మీభూతంబులగు. రావుగారు నిన్నన్నివిధముల భ్రష్టుని జేయకుండ వదలడు. నీకెందుకీగొడవ? ఈ క్షణమున 20 వేలు గల్గిన నీ చేతులో బోసెద. నీవు తగ్గుము.

వీర—(కోపమున) ఎంతమాట సెలవిచ్చావమ్మా? ఆఁ అంతకంటె అపరదిట్టుందా ఇంక తలెత్తుకుని పెద్దిమనిసులో తిరగల్నా? పౌరుసంలేని బతుకు బతకేకంటె, గుక్కెడి జీవణం వొదిలేసి, సత్తేమేలు. ఏదవ డొబ్బు! శాసొతదా? అనాడు యీరన్నకాపు పెసిడెంటు గిరికి నిలముసి, డొబ్బుకోసం కక్కూర్తిపడి, పౌరుసం సంపుకొని, యెనక్కి తగ్గిపోయాడని, సచ్చినాగాని సెప్పుకుంటారే. మీరు బేమ్మలు, మీకు తప్పులేదు. ఇన్నేలని మీరే సెప్పండి. ఇచ్చేత్తాను. ఇదిగో దత్తు. ఏఁవంటారు. (నోట్లకట్టలు ముందర బెట్టును)

లీల—(కోపమున) ఎన్నిసార్లు చెప్పను?

వీర—(కోపముతో) అంతేనా? ఏటీ? అంతేనా!

లీల—(కోపముతో) అంతేయే. ఇక వెళ్లవచ్చును.

వీర—(కోపముతో) మరి నాసెయరండి. ఆసట్టుదలేంటో సూస్తాను. ఆనాడు పాండవ్వలోన అర్జునుడే సేశాడు. ఈనాడీ యీరన్నే సేశాడు సెగ్గ.

మ. ఇనుడీ, నాదుపిత్రిగ్గ, లచ్మ్యిమిన గానీ, ఆస్తి సుద్దాగ పో
యిన పోనీ, ఉఫుడీ వెలక్ససున సాయేబయ్యనోడింపకే
నెనకం జేసిన, నాపామిమానమిది నానే కాదు. నా పేరె యీ
రన బావన్దయనాను. కోట సిసనూరియోకొడుకై నేగాదికన్.

(అని నిష్క్రమించును)

లీల—(తలనూచి) ఇంద్రజాల మహేంద్రజాలికుడు, కపటవారీచు డావకీలురావు, వెనుక నిల్చి యాడింపకున్నచో, నీ సిరిబొమ్మను జూచువారెవరు? (తలనూచి) It is because of this sort ot people that the Local Boards are destined to be abolished.

(డాక్టరు లతీఫు ప్రవేశము)

లతీ—(ఆలోచించుచు) Good morning లీలా!

లీల—Very Good morning. Take your seat.

లతీ—(దూరముగ గూర్చుండి యాతుర్దాతో) నీవు Promise చేసిన అగ్గురు మెంబర్లు Vakil Rao యింటివద్ద ఉన్నారు, ఆ Villain మాయచేయడుగదా?

లీల—తిరిగిపోరు. నాదిపూచీ. వలసినకట్టుదిట్టముఁ జేసితిని.

లతీ—మని రెడీ చేసితివా?

లీల—నా Adopted son చేతగూడ Pronotes వ్రాయించి, మరల 20 వేలు తెప్పించితిని.

లతీ—(విచారమున) లీలా? కలలోగూడ నాకు వకీలురావే కనబడుచున్నాడు. నాకు నిద్రా పట్టడంలేదు.

లీల—రావుతెక్కే నీకేమి? నీపార్టీబల మెట్లున్నది?

లతీ—(కొంచెము నవ్వుతో) వీరన్న జస్టిసుపార్టీ. నేషనలిస్టుపార్టీవారు వోటీయరు. మనము సంశయించుచున్న మెంబర్లందరు మనవేపు ఒగ్గితే, ఇండిపెండెంటు పార్టీ అంతా వీరన్నకు వోటీయరు. ఆరెండు పార్టీలు నాకే యిచ్చెదరు.

అప్పటికి 24 వోట్లు నాకువచ్చును. నీవోటున్నదిగిదా? ఇంక నొక వోటు మాత్రం తక్కువ. అది పంచముల తరపు మెంబరు సూర్యారావువోటు. వీరన్నకుమాత్రం యీవోద్దని నేషన్‌లిస్టుపార్టీవారు Canvas చేస్తున్నారు. వీరన్నకు సూర్రావుకీ terms కుదరలేదు. అదనంగా మాట్లాడితే మన కీయవచ్చును. ఏజెంటు నాటకాల నాగన్నను పంపించాను.

[ఏజెంటు నాటకాల నాగన్న సూర్యారావుతో ప్రవేశము]

లతీ—(ఆనందమున) Good morning. సూర్రారావుగారూ! రండి. రండి. దయసేండి.

లీల—Good morning. సూర్రావుగారూ?

లతీ—(ఆనందమున కుర్చీ నిచ్చును)

సూర్యా—(మొగము ముడిచికొని) ఈఎలక్షనుగౌరవాలు, ఎత్తులు నేనెరుగుదును. గుడ్ మోర్నింగులతో కడుపునిండదు. చప్పున తేల్చండి.

లతీ—మీవోటు నాకిప్పించాలి.

సూర్యా—అభ్యంతరమేమి? మీకే యిస్తాను. మీయభిప్రాయం తేల్చండి.

లతీ—(సూర్యారావు చెవిలో గుసగుసలాడును)

సూర్యా—అబ్బే! కుదరదు, ఎందుకూ వీరన్నే ఉన్నాడులెండి. (లేచును)

లతీ—(గుబాలునఁ బట్టుకొని) కూర్చోండీ మారాజ్, తొందరపడ్తారేంటి?

సూర్యా—ఈగడియదాటితే మీరు మామొగం జూస్తారా? పీర్లపండగలో నే పెద్దపులి వేషాలు. చప్పున తేల్చండి. ఊఁ.

లతీ—(సూర్యారావు చెవిలో గుసగుసలు)

సూర్యా—(కోపముతో లేచిపోవుచు) అస్తమానం ఇదే గొడవా? ఏమీఅనరాదు. వినరాదు. నామాట చెల్లిస్తేనే ఓటిస్తాను.

లతీ—(పట్టుకొని) దయావుంచండిమారాజ్!

సూర్యా—ఎవడిలాభం ఎవడు వొదులుకుంటాడయ్యామారాజ్. ఊఁ! చప్పున తేల్చండి. వీరన్న నాకోసం కనిపెట్టుకున్నాడు.

లతీ—(లీలకు సంజ్ఞ సేయును)

లీల—రండి సూర్యారావుగారూ!

[లీల సూర్యారావులు నిష్క్రమించి లీల మరల ప్రవేశము]

సూర్యా—తరువాయిమాట?

లీల—ఓటింగురోజున మాట్లాడుదము. ఎందుకు? నాదిపూచీ.

సూర్యా—ఆమాట తేలినాకే ఓటిస్తాను. ఎలక్షను 10 రోజు లుండిగదా! సరే కానీండి. (నిష్క్రమించును)

లతీ—(ఏజెంటుతో రహస్యముగ) ఓటింగయ్యేవరకు, యీసూర్యారావును, తిరిగి పోకుండా చూడాలి. ఓటింగురోజున మనమేడగదిలోబెట్టి తాళంవేయాల.

నాగ—ఎందుకు? నాదిపూచీ. మరి నామాట?

లతీ—నిన్ను సంతోషపెడ్తాను. సరే! కానీ. ఆన్కచూద్దాం.

నాగ---వీరన్న చేరికలోవున్న సూర్యారావును మాయజేసి తీసుకువచ్చి మీకప్పగించాను. అన్నమాటకంటె డబుల్ గా సంతోషపెట్టాలి. ఎలక్షను గిరాకీ. అరువులులేవు. ఎప్పటిదప్పుడే, ఆనకంటె వ్యాపారం యెదురుతిరుగుతుంది. చూచుకోండి.

లీల---నాగన్న గారూ, రండి. (లీల నాగన్నతో నిష్క్రమించి, మరల లీలమాత్రము ప్రవేశము)

లీల---(ఆనందమున) లతీఫ్? నీబెంగ తీరినదియా?

లతీ---(ఆనందమున) Yes. ఇక నేనుతప్పక గెలుస్తా. సందేహంలేదు. భగమంతుని దయావుండాల. (యని యాకసముం జూచి చేతులు జోడించి) యారబ్ దితే ముస్లింకు ఓజిందా తిమన్నాదే, జోఖిల్బకు గర్మామేదే, జోరూహాకు తడపాదే, జేలూ సేమహబత్ హో బేబాక్ సదాఖత్ హో, సినోమే ఊజా లేకర్ దిల్ సూరతే మైనాదే, (యని భగవంతుని స్తుతించి జేబులోనుంచి కాగితముదీసి) లీలా! ఇది మన Marriage draft invitation.

లీల---(కాగితముం బుచ్చుకొని ప్రేమ దృష్టితోం జూచును)

లతీ---లీలా? Civil marriage act క్రింద మనము స్థిరపర్చుకున్న పెండ్లి unnecessary గా యింతవరకు ఆలశ్యమైంది. ఎలెక్షను అయినాక నాకషల్ తీర్చడివుండను. ఈనెల 10 తేదీనాటికి మనము పెండ్లీ చేస్కుని Polling నాటికి రావాల. బంధువు లందరికి Invitation పంపిచ్చా.

లీల---(ఆనందమున) Yes.

లతీ—(లేచివచ్చి) మహానందమున Shake hand నిచ్చును)

లీల—(ఆనందమున Shake hand నిచ్చును)

లతీ—(ఆనందమున) చీరో. Good bye.

లీల—(ఆనందమున) ఓ. కె. Good bye.

[ఏజెంటు నాటకాల నాగన్న తొందరగ ప్రవేశము]

నాగ__వీరన్న జట్టువచ్చి సూర్యారావుగారిని బహిరంతముగ కొల్లో చేసికొని లాక్కొని పోయినారండీ. వినినారా?

లీల__(కంగారుపడిన) లతీఫ్. నాకొరకు వేచికొని పరుగెత్తుము. పరుగెత్తుము.

లతీ__(కంగారున పరువిడుచు) కారు. కారు. (అని నిష్క్రమించును)

నాగ__(నిష్క్రమించుచుఁ దనలో) మేము వీరన్న మనుష్యులము. రావుగారి పన్నాగమునిబాధ వచ్చినను తీరునుగదా! (అని నిష్క్రమించును)

లీల__(ఆలోచించుచు నిష్క్రమించును)

## ద్వితీయరంగము.

[లీల మందిరము యశోద ప్రవేశము]

యశో__(దుఃఖించుచు) అయ్యో? ఇంకేమున్నది! ఇంకేమున్నది! నాకోడలు నా కొంప ముంచినది. నాగంపెడు నగలు దీసికొనిపోయినది. అయ్యో? ఎవరితో జెప్పను, అపకీర్తి. నవ్వువారికి నవ్వసందు. చెప్పువారికి చెప్పసందు. నాపెనిమిటి యార్జించిన సొమ్మొట్టి పాపపుమాటయని తలంపలేదు. నామహారాజు సంపాదన భూమిమీదఁ బేరు లేకుండ హరించిపోయినది. లీలా! ఆస్తి ఋణముల పాలుచేసితివి. ఋణదాతలకు మమ్మొప్పగించితివి. ఎట్టికొంపకెట్టి గతిఁ దెచ్చిపెట్టితివే! అయ్యో? ఎక్కడనున్నదని వెళ్లను. చచ్చిపోలేరుగదా? ఏమిటీ యవశకునము. తలఁచుకొనినఁ గడుపు చెఱువగుచున్నది. ఎట్టిమాట వినఁబడునోగదా! అమ్మా? లీలా?

గీ. పెద్దచిచ్చు నాకడుపునఁ బెట్టి చనిన
సుతునకున్నారుగా నిన్నె చూచుకొనుచు
నలరుచుంటిని యొకకూతురైన లేదు
ఇంకనాముష్ణు గడుపువా రెవరుతల్లి?

[విచారమునఁ దలవంచుకొని. యుత్తరముతో మురళీధరుఁడు ప్రవేశము]

యశో___(ఆత్రమున) ఏమిరా నాయనా? మీయమ్మ వృత్తాంత మేమైనఁ దెలియ వచ్చినదియా? (కంగారున) మాటరాదేమిరా? బ్రతికియున్నదిగదా?

ముర___(విచారమున) బ్రతికియున్నది.

యశో___పోనిబాబూ! ఎక్కడ నున్నదిరా?

ముర___(లేఖను దీసి చదువును) సంస్కారిణినై విద్యావతీసంఘమున కెల్ల మార్గదర్శినిగా దలంచి, డాక్టరు లతీఫును బెండ్లియాడి యతని యింటనుంటిని.

యశో___(త్రుళ్లిపడి యాశ్చర్యమున) ఆఁ ఆఁ! పెండ్లియైపోయినదీ! ఆసాహేబునే పెండ్లి చేసుకొనినదీ? నారాయణా! నారాయణా! మొన్నటినుండియు నా కడుపున చెప్పలేని యావేదన ప్రారంభించినది. ఈయశుభసూచనకే కాబోలురా తండ్రీ! అనుమానించినట్లనే జరిగినది. ఇంకేమున్నది, యైపోయినది. (యని బోరున దుఃఖించును)

ముర___(విచారమున)జననీ! మార్గదర్శినినై సంఘమునకుఁ జూపఁదలంచిన సంస్కారమిదియా? ఆహా?

సీ. సంస్కారమగునె? నైచ్యప్రభావముగాని
యధమవర్ణునియింటి యారుఁదనము
సంస్కారమగునె? నైచ్యప్రభావముగాని
యధమవర్ణను బెండ్లియాడుతలఁపు
సంస్కారమగునె? నైచ్యప్రభావముగాని
యధమవర్ణునితోడి యారగింపు
సంస్కారమగునె? నైచ్యప్రభావముగాని
యధమధర్మావేశనాభిలాష

గీ. నిజకులోచిత ఋజుమార్గ నియతివిడిచి
విధి నిషేధంబువిడిచి, కావించునట్టి
సంఘమానచ్ఛిదాకార్యజాతమెల్ల
సజ్జనస్తవనీయ సంస్కారమగునె?

యశో___(దుఃఖమున) లీలా, లీలా, నన్నెవరి కొప్పగించితివేతల్లీ!

ఉ. కూతురివైన నీవె, మఱి కోడలివైనను నీవె యంచు నీ
చేతులమీఁద నాతనువు చిక్కెడు బూడిదఁ జేతువంచు ని
ర్భీతిని నమ్మియుండఁగ గుభీలునఁ గడ్పునఁ గొడ్డఱంపపుం
గోతను దెచ్చిపెట్టితివ ? కోడల ? యన్నివిధాల ముప్పునన్.

అయ్యో ! ఇహపరంబులకు దూరమై, బంధువ్రజంబునకు దూరమై, తోడునీడకు దూరమై, సంబంధబాంధవ్యములకు దూరమై, చివరకుఁ గులమునకుఁ గూడ దూరమైపోయితివా ? (బోరున దుఃఖించుచు) ఇంక నాకోడలివిగావా తల్లీ ! నీఋణంబు దీరిపోయినదా ? నానట్టింటఁ గనుపడవా ? కలకలలాడుచు ధనలక్ష్మివలె నాకండ్లయెదుట దిరుగు దినములు గతించినవా ? నాయింటిని దిబ్బజేసి నీయానందము నీవుచూచుకొంటివా ? (దుఃఖము నిగమింగి) అయ్యయ్యో! ఏమి దుష్కాలమొదవినదిరా తండ్రీ! చదువుకొనిన నవనాగరికతా మహిళలమని, కులభ్రష్టలైపోవుచుండిరేమిరా ? తనశాఖలోవానిని జేసుకొనఁగూడదా? ముందు ముచ్చట్లు వెనుక చప్పట్లు. లోకమును మూయఁగ మూకుఁడున్నదా? అయ్యయ్యో! మేనత్తనైయుండికూడ దాని ధాటీకి జడిసి పిల్లినై నేను దిరిగితిని. సింహమువంటివాడవు, బియ్యేప్యాసయిన విద్యాధికుడవు, మాతృభక్తితో నీకండ్లు మూసుకొనిపోయినవి ? (ఆలోచించి) స్త్రీస్వాతంత్ర్య మీరీతిగ పరిణమించుచున్నదేమిరా నాయనా? ఎంతపనిచేసినదిరా? ఎంతపనిచేసినదిరా?

ముర—(విచారమున) బామ్మా? నాకండ్లమైకమిప్పుడు వదలినది. ప్రతివిషయ యథార్థస్థితియు నిప్పుడు నాకు బోధపడుచున్నది. ఆహా !

సీ. మాతృదేవతయంచు మదినమ్మితినిగాని
గంగగల్పునటం చెఱుంగనైతి
విదుషియంచును గౌరవించి కొల్చితిగాని
యజ్ఞానురాలటం చరయనైతి
పుత్రవత్సలయంచుఁ బూజించితినిగాని
ధర్మదూరయటంచు దలఁపనైతి
ఉన్నతాశయ యంచు నుప్పొంగితిఁ గాని
చంచలహృదయ యం చెంచనైతి

గీ. అమ్మనుడియెల్ల వేదవాక్యమ్మటంచు
జెప్పినట్టులనన్నియుఁ జేసినాఁడ
నప్పవాండ్రగికట్టిరి యా స్త్రీవోమె
నిపుడు చింతించినన్ మాత్ర మేమిఫలము!

యశో—(విచారమున) ఔనురా నాయనా?

ముర—(విచారమున) ఆమె కట్టబుద్ధి యుదయించుట నాదురదృష్టము. నాదౌర్భాగ్యత. నాపూర్వజన్మానుగతపాపఫలము. బామ్మా? ఆమె క్షేమమునకై మనము సర్వదా పరమేశ్వరు నారాధింతము.

యశో—(విచారమున) ఆహా! నాయనా! నీయట్టి పవిత్రహృదయునిపై భగవంతునికైన దయలేకపోయిన దేమిరా?

ముర—(విచారమున) బామ్మా! దేహి కర్మఫలమునకు భగవంతుఁ డేమిసేయఁ గలఁడు.

సీ. పట్టాభిషేక సాంమ్రాజ్యయోగమువీడి
యల్లాడె శ్రీరాము డడవులందు
ప్రాజ్యరాజ్యమువాసి పాండవుల్ కానల
విమనస్కులై యష్టకష్టములఁబడిరి
భోగంబు రాజ్యంబుఁ బోయి నిషధరాజు
కలిబాధలకుజిక్కి కష్టినడిరె
నవని భీష్మాచార్యునంతటి బ్రహ్మణ్యుఁ
డమ్ములశయ్యపై నావులించె

గీ. నరయ నెంతటివానికి నైన ధాత్రిఁ
గట్టికుడుపకతీఱదు తుట్టతుదకు
మంటఁగలిసి నన్నిడువదు వెంటబడక
కాలచోదితమైనట్టి కర్మఫలము.

యశో—(విచారమున) ఇంక వేదాంతముగాకే మున్న దిరా నాయనా!

గీ. ఎంత ధనమధికారమున్నంతపఱకు
మిఁగులఁ గన్నుమిన్నుగాన కెగిరిపడును
దైవకృప ధనమధికారితనముపోవ
నయ్యగారికి వేదాంతమంకురించు.

దత్తులకాస్తి నిల్వదుగాబోలురా నాయనా? పద. నామాట విను. మాయిల్లాలగు భార్యను వెళ్లగొట్టినవానికి మంచిదశ పట్టదురా బాబూ. నీభార్యయొద్ద కేగుదముపద. ఇంక మన కదియేగతి.

ముర—(తల నూచి, యాలోచించుచుండును)

# న వ యు గ ము

## చ తు ర్థా ం క ము.



### ప్రథమరంగము.

(ఎన్నికల దినము)

(బోర్డుబిల్డింగు. సామీప్యస్థలమెల్ల జనకోలాహలముతో, మోటార్లతో, బండ్లతో, బ్యాండుమేళములతో, ప్రజాసమూహముతో, క్రిక్కిరిసి యుండును)

[డాక్టరు లతీఫు, వీరన్న పార్టీలు ప్రవేశము]

(కచ్చేరీలో లతీఫులీలలు ప్రవేశము. బల్లమీద Ballad box ఉండును)

లతీ—(కంగారుతో) లీలా ! సూర్రావు తిర్గిపోడుగదా ?

లీల—ఏమో ? ఏక్షణమున కెట్లు మారెదరో ? ఈయెలెక్షను యెత్తులు గ్రహించుట కేరితరము ? (అని రహస్యముగ నెద్దియో చెప్పును)

లతీ—సరే. లేకున్న ఓటు నియడు.

(దూరమున వకీలురావు సూర్యారావుతో ప్రవేశము)

రావు—(సూర్యారావు చెవిలో రహస్యముఁజెప్పి) నేనెందుకు చెప్పితినో వినుము. వెళ్ళుము.

సూర్యా—చిత్తము. (అని లతీఫు దగ్గర కేగును)

లతీ—(ఆత్రమున) సూర్రావుగారూ ? దయసేయండి. మాట (లతీఫు సూర్యారావుతో నిష్క్రమించి, మరల సూర్యారావుతో ప్రవేశము)

సూర్యా—(జేబు సవరించుకొనుచు రావువైపుఁజూచి తలనూపును)

రావు—సెబాస్ మంచిది. (వారియొద్దనే యుండుమని సంజ్ఞ సేయును)

లతీ—సూర్రావుగారూ ! ఓటు యిచ్చేదాకా మీరుమావొద్దనే ఉండండిమారాజో,

సూర్యా—అల్లాగే. అనుకున్నప్రకారం జరిగినప్పుడు దగా జరుగుతుందా? వీరన్నకు తాగుమోతుజట్టు చాలా ఉంది. కూనీలుగూడా చేస్తారు. ఆనాడు మీమేడ

దిగేటప్పటికి అర్జాత్తుగా కొర్లో వేసి లాక్కుపోయారు. సమయానికి మిమ్మల్ని యెతుక్కుంటూ ఇప్పుడు వచ్చానా లేదా? నావిషయం మీరేమీ సందేహించనవసరము లేదు. మిగతా మెంబర్లను గట్టిచేసుకోండి. వాళ్ళ బుద్ధులు మంచివిగావు. నమ్మించి గొంతుక కోస్తారుసుమండీ. టయిమయింది ఎలెక్షనుఆఫీసరుగారు వచ్చేస్తారు.

లతీ—(కంగారున బిగ్గరగా) సౌదరీ! రండి. రాజ్! దయ సేయండి. ఇస్మాయిల్! జాఫర్! లాదుమ్ఖాన్! ఓటర్సుకు బులావ్.

[వీరన్న ప్రవేశము]

వీర—(సూర్యారావును జూచి తల నూచి కోపమున) మెంబరవి. మల్లీ సమ్మకునోడవు. పెద్దమనిసినని నలుగుర్లో తలెత్తుకు తిరుగుతావు. ని సిత్తప్రకారం జరిపానే, నమ్మించి సివరికి సిటుక్కున పారిపోతావా? కానీ, కానీ. నేను పెశిడెంటయినాక, జిల్లామొత్తంమీద, ఏసెరువునీళ్ళు తాగుతావో సూత్తాను గాదూ? అప్పుడే అయిపోయిందనుకోకు. నువ్వు చేపిన సామిద్రోవం కుడి డొక్కలో మెసల్తోందిలే, నల్లగుండెల్లో నిద్రోతా. సూడు నాతమాసా. కానీ! కానీ. (యని మీసము దువ్వును)

సూర్యా—(వీరన్న వైపుఁజూడక మెల్లగా) అనుకో, . అనుకో, ఎన్ని అనుకుంటే నాకేం? ఉల్లు గాలికిపోతాయి.

వీర—(కోపమునఁ జూచుచు) ఒయ్యోయి! సూరారావ్, సూరారావ్! (అని బిగ్గరగ బిలిచి) అఁ! సెయిసిక్కింది. పిలిత్తే మాటాడతాడా? కానీ. మాటాడకు, మాటాడకు. సర్లే. తస్సాగొయ్యా!

(తెరలో 11 గంటలు వినఁబడును)

వీర—(కంగారున) ఒయ్యోయ్! గోలి చుబ్బయ్యా. సుందు చోమయ్యా, మన్నెం కిట్టమ్మా. మన వోటర్లందర్ని తీసుకురండి. అయ్యో, ఇంకా సూత్తా కూకుంటారేంటి! లైనయింది. (అని దూరముగనున్న వకీలురావునొద్దకేగి నమస్కరించి) ఈఎలక్సనంతా మీలో ఉంది. మీరు లేకపోతే నేనింతఘట్టుకు రాను, నిలబెట్టేరు. ఇంక నన్ను పెశిడెంటును సెయ్యాల. అందులో ఉంది మీ సమత్కారం. బాబోయి, మన వోటర్లలో ఎవడు బంగం సేయ్యడుగందా. సూసుకున్నారా? గాచ్చారం. అప్పుమాట దైభ మొరుగును, గుప్పున నవ్వుతారు.

రావు—(గర్వమున) చక్రధరునివలె వకీలురావు వెనుకనుండ నీకపజయముండునా? సందేహింపకుము. నిన్ను గెల్పించి పూలదండతో నూరేగించు పూచీ నాది.

వీర—(నవ్వుచు) ఓయ్. నన్నూరేగిస్తారా పూల్దండేసి! మెళ్లోండా పూల్దండవేసి. (యని పెద్దనవ్వునవ్వి) సిత్తం. సిత్తం. అంతా మీదే. సంచులు సంచులు గుప్పేయిమంటే గుప్పేశాను. మీరేం తిప్పలు బడ్డారో నాకేం తెల్సు? నీల ముంచినా మీరే, పాలముంచినా మీరే. సామోరి సొచ్చిగా నిమ్మల్నే నమ్ముకున్నాను.

[పోలీసు. డి. సూపరింటెండెంటుగారు ప్రవేశము]

డి. సూ—(బిగ్గరగ) Silence. Election officer గారు వచ్చుచున్నారు. (అని యిటునటు తిరుగును)

(రెండు పార్టీల వోటర్లు ప్రవేశము. ఎదురుగ చెరియొకవైపున నిలిచియుందురు. ఎలెక్షను ఆఫీసరుగారు ప్రవేశము)

డి. సూ—(బిగ్గరగ) Silence. (శాల్యూట్ చేయును)

ఎ. ఆ—(శాల్యూట్ చేసి కూర్చుండి కాగితములు జూచుకొని లేచి) డాక్టరు లతీఫు గారు చెయిర్మను వీరన్నగారు ప్రెసిడెంటుపదవి కభ్యర్థులుగ నిలిచి యున్నారు. వారికోట్లు నియదలంచిన వారి పేపరుమీద, నా పేరునొద్ద X మార్కు పెట్టి మీమీ వోట్లనీపెట్టెలో వేయవలయును. (అని కూర్చుండును)

లతీ—(సూర్యారావును వోటువేసి రమ్మనమని ముందునకుం ద్రోయును)

సూర్యా—(ఎలెక్షనాఫీసరునొద్దకేగి నమస్కరించి) కాగితం, ఏదండి అయ్యా?

ఎ.ఆ—నీపేరు,?

సూర్యా—చిత్తం. నా పేరు సూర్యారావంటారు.

ఎ. ఆ—(వోటర్లలిస్టుం జూచుకొని, సూర్యారావును బరికించి చూచి) మీరెందులకు వచ్చితిరి. మీవోటు Invalid అయిపోయినదియే (యని రికార్డుం జూచు కొనుచుండును)

సూర్యా—(తెల్లంబోయి యెరుగనట్లు చూచుచుండును)

(వీరన్న పార్టీలో చప్పట్లు)

డి. సూ—(బిగ్గరగ) Silence.

లతీ-లీల—(వివర్ణవదనులై చూచుచుందురు)

వీర—(దూరముగనున్న రావునొద్దకు సంతోషముతో బరువెత్తి) ఎంతోడువయ్యా! ఆశ్చర్యం, సూర్రావు కొంపదీసేస్తాడని నాగుండె గుబేలు గుబేలుమంటోంది. ప్రాణాలు ప్రాణాల్లో లేవు. (చేతులు జోడించి) ఎంతలో సెక్రం తిప్పేశావయ్యామారాజా. ఆఁ, వకీలంటే మీరేగాని యింత బెమ్మాండంశక్తి, యింత బెమ్మాండం యెత్తులు ఎవరికుంటాయీ అంటా!

రావు—(మీసము దువ్వుచు) వకీలురావు శక్తి తెలిసినదియా?

వీర—(చేతులు జోడించి) తెలిసిందిబాబూ! మీసెర్య సూస్తే గుండె గుబికిగుబికి మంటోంది. మేమెంతేడ్సినా, బెమ్మనమారాజు బెమ్మనమారాజే. ఏసెక్రం తిప్పినా ఆమారాజే తిప్పాలి. ఆతెలివితేటలు మావోళ్ళకి సత్తేరావు. ఎగిరి పడతారు. ఎందుకు?

డి. సూ—(కోపమున వీరన్నను జూచి) ఏమిటి? అయసందర్భ ప్రసంగము. Silence.

వీర—నేను జట్టీసుపార్టీవోణ్ణి నాకేం?

సూర్యా—నావోటు Invalid అయినట్లు నాకేమియుఁ దెలియదండీ.

ఎ. ఆ—నీవు రిజిగ్నేషనిచ్చితివి. చూచుకొమ్ము. (అని కాగితము సూర్యరావుచేతి కిచ్చును)

సూర్యా—(కాగితముఁ బుచ్చుకొని దొంగచూపు చూచుచు) ఈవ్రాత నాదికానే కాదు.

ఎ. ఆ—అది నీ చేవ్రాలుగాదా?

సూర్యా—(కాగితముఁ జూచుచు) నాసంతకంలాగేవుంది గాని, నేను చేసియుండ లేదు. ఎవరో ఫోర్జరీచేశారు.

వీర—(రావుతో) ఏం ఎత్తు యెత్తించావయ్యా బెమ్మడ! సెబాస్. సెబాస్.

ఎ. ఆ—ఫోర్జరీ యెవరు చేయించినారని నీయుద్దేశము?

సూర్యా—చెయిర్మనువీరన్నగారే చేయించినారని నాయుద్దేశము.

వీర—(రావును జూచి భయమున) అయ్యో! నాకొంప దీశాడేటి గారారం? ఆఁ, నేనేం యెరుగుదును? సెక్రం యెదురు తిప్పావేంటిబాబూ?

రావు—(ఊరుకొమ్మని సంజ్ఞ సేయును)

ఎ. ఆ—(ఆలోచించి) నీరాజీనామా నంగీకరించితిమి. తగాయిదాయుండిన కోర్టులో దావా తెచ్చుకొమ్ము.

వీర—అయిన షౌరం అవగా, పైపెచ్చు శాల్జిలు, కావాలూనా ? బాగుందవ్వారం. ఆడోళ్లిప్పటికే నుమ్మొత్తుపోతున్నారు.

ఎ. ఆ—(డి. సూపరింటెండెంటుతో) ఈసూర్యారావు నావలను బంపివేయుము.

డి. సూ—(సూర్యారావు నావలకుం బంపివేయును సూర్యారావు నిష్క్రమించును

(వీరన్న పార్టీలో కరతాళధ్వనులు)

శీల—(ఓటును పెట్టెలోవైచి వచ్చి యథాస్థానమున నిలుచుండును)

శాస్త్రి—(ఓటు నిచ్చి నిష్క్రమించును)

(మిగిలినవారు నొకరొకరు వోట్లనిచ్చి నిష్క్రమింతురు)

ఎ. ఆ—(లేచినిలిచిబిగ్గరగ) ఓట్లు అయిపోయినవి. లెక్క పెట్టుచున్నాను. డాక్టరు లతీఫు! చెయిర్మను వీరన్న! మీరిరువురు నాకిరుప్రక్కలనిలిచిచూచుచుండుడు. (అని వోట్లు విభజించి లెక్కించి) డాక్టరు లతీఫుగారికి 25 వోట్లు వచ్చినవి. చెయిర్మను వీరన్నగారికి 26 వోట్లువచ్చినవి. Veeranna Bahadur elected as President.

వీర—(మహాసంతోషమున) ఈరన్న పెశిడెంటుగారికిజై. (రెండుసార్లుకేక)

(వీరన్నగారికి జయజయ ధ్వనులు. వీరన్నజట్టు వీరన్నగారికి కంఠంబునం బుష్పహారములు వేయుదురు. బ్యాండు మ్రోగును.)

వీర—(మహానందమున పూలదండలు తెప్పించి ఎలెక్షనుఆఫీసరుగారికి, సూపరింటెండెంటుగారికి సమర్పించి. రావునొద్దకేగి) ఈమాత్రంతా మీది. మీదయవుండమట్టి నేను నెగ్గేను. (అని మరియొక దండ రావుగారి మెడలో వైచి నమస్కరించును) (బ్యాండు మోగియును)

ఎ. ఆ—(వీరన్నకు shake hand నిచ్చి నిష్క్రమించును)

డి. సూ—(వీరన్నకు shake hand నిచ్చి నిష్క్రమించును)

వీర—(ఆనందమున) నాకు ఎలెక్షను ఆఫీసరుగారు, సూపరెంటుగారూ కూడా సేకేండం యిచ్చారు.

రావు—(వీరన్న చెవిలో నుపదేశము)

వీర—(చేతులుజోడించి బిగ్గరగ) నంబర్లందరికి స్నేహితులందరికి మనవిసేసుకునేదేంటంటే, మీఅందరి దయవోల్ల, నేను పెశిడెంటయినాను గనక, నా సంతోసం తెలపడంకోసం, ఊరేగింపు టీపార్టుఉంది గనక, డైనేసి సందాల 4 గంటల్కి బిల్డింగుకాడికి రమ్మని పెశిడెంటుగారి సెలవైంది. మీరందరు రావాల. ఇది నా పార్ధన. ఈరన్నగారికీ జయ్!

(వీరన్న బహద్దరుకీ జెయ్ యను కేకలు)

రావు—(లీలా లతీఫులం జూచి యొకసక్కెముగ) ప్రత్యర్థిహృదయప్రోద్ధతాస్మితా ప్రభూతస్మయాపస్మార కరంబిత దుస్తంత్ర ప్రశమన ప్రజ్ఞాబల తృణీకృతా పరచాణక్యావతారుండగు వకీలురావును జ్ఞాపకముంచుకొందురుగాక.

లతీ—(కోపమున) మావద్ద రెండువేలూ పుచ్చుకొని సూరాం రావుచేత రిజిగ్నేషన్ పెట్టిస్తావ్! విలన్.

రావు—(చిరునగవున) These are all election tactics my dear friend.

వీర—లతీఫుసాయీబుగారూ? సలామ్. (మీసము దువ్వుచు) కొనిపించినమంచు లన్ని కొట్టేసి, సివరికి డావా సేస్తావా? ఈరన్నకొపు మజా తెల్సిందా?

లతీ—(అప్పుడేసంతోసించకు. నీ ప్రెశిడెంటుగిరీ నిల్చినప్పుడు సూస్తానులే. కొనీ.

రావు—(ఆలోచించుచుండును)

వీర—(రావునొద్దకేగి యానందమున) ఊరేగింపుకు దిరీ సేసుకోవాల రావయ్యా బాబూ! ఏంటీ యాలోచన. (తనలో) మల్లీ యెవరికొంప దీద్దామని ఆలోసిస్తున్నాడు కొమోసు బాబు.

రావు—(తనలో) తలచినపని కొంతవరకు నెరవేరినది. ఇక వీరన్న నొక చూపు చూడవలసియున్నది. ఇతడుమాత్రం సామాన్యుఁడా. లతీఫుపార్టీచే No Confidence motion (తలనూచి) That ends this fellow. (ప్రకాశముగ) వీరన్న! రమ్ము.

(వకీలురావు, ప్రెశిడెంటు వీరన్నగారు నిష్క్రమింతురు)

లతీ } లీల } (ఖిన్నవదనులై నిష్క్రమించుచుందురు)

లతీ—(విచారమున) లీలా? ఇన్సాన్ ఏక్ చెహతాహై ఖుదా ఏక్ కర్తాహై. ఇన్సాన్ గంసహే బేకసీనా సహాసకే షిర్మిందీసే. మౌత్ బెహతర్ హై. A man may survive distress but not disgrace. Disgrace is worse than death. ఇట్లా జరుగూతుందని, కల్లోనైనా అనోక్లేను. ఎట్టితలవంపూవచ్చింది? ఎంత దురదృష్టంపట్టింది! ప్రాక్టీసుమాని Hospital కట్టీవేసి, మూడు నెలల్ నుంచీ, నాపార్టీని వీరన్న, వీరన్నపార్టీని నేను, దిగదీస్తూ, వీరన్న 3 వేలంటే నేను 5 వేలని, నేను 5 వేలంటే వీరన్న 10వేలని. వోట్లు వేలం పాడించాము. ఎంత తెలివితక్వా పనిచేశాను. ఈజూదాన్కి వెళ్ళవద్దని యెంతమందిచెప్పినా విన్నానుగానుగదా. రోషంచేత, వ్యూర

వాడీలవద్ద, రోజువారీవడ్డీకి తెచ్చి, సంమల్ మీద సంచుల్ జల్లేసి సాపర్లై పోయాను. తెచ్చిన ఋణం ఆస్తిని మింగేసింది. (కన్నీరు దుడుచుకొనుచు) అరే. అల్లా. (అని నోసలు కొట్టుకొనును)

లీల—(విచారమున) Man plans one thing, god plans another. ఇరువుర మొక దుస్థితిలోనికే వచ్చితిమి. ఇప్పుడు విచారించినమాత్ర ఫలంబేమి! పోవుదమురమ్మా.

(ఇద్దరు నిష్క్రమింతురు)

# ద్వి తీ య రం గ ము.



[రుక్మిణి పుట్టినిల్లు. రుక్మిణి యాసీనయై ప్రవేశము]

రుక్మి—(విచారమున)

చ. మనములఁ బ్రేమగల్గి, యభిమానముగల్గి, పరస్పరైక్యభా
వనములఁ బొద్దుపుచ్చుచుఁ బ్రపంచసుఖంబుల ననుభవింప, ము
న్మునికొని యెట్టినోములను నోచిరొ? యేయిలువేల్పుఁగొల్చిరో
ననుపుగ నేవ్రతంబుల నొనర్చిరొ? పుణ్యసతుల్ ధరిత్రిపై.

(భర్తం దలంచుకొని కన్నీరు విడుచుచు) ప్రాణనాథా? ప్రాణనాథా? నీ ముఖసందర్శనపుణ్య మీజన్మమున నాకు లభించునా? నీపాదకమలసేవాభాగ్యము మరల నాకుఁ బ్రాప్తించునా? నీదరహాసకందళితమృదుమధురోక్తులు విని యానందించు సుదినంబు లీభవంబున నాకుఁ గలవా? నీతోడి సంసారసుఖము నేను పెట్టిపుట్టలేదా? నిన్నే ధ్యానించుచు, నీనామస్మరణం బొనర్చుకొనుచు, దరిగానరాని భవద్వియోగాంబురాసిని మున్కలిడుచు నాథా! నాథా! నాథా! యని నీకొఱకెంతకాలము పలవింతును, నీసన్నిధినుండి నన్నాళు లెట్టికోడంట్రిక ననుభవించుచున్నను నీయనురాగంబుచే నించుకయు గష్టమనిపింపలేను. ఎన్ని యమబాధలు పడుచున్నను, నీదర్శనాప్తిచే బాధలుగ గన్పింపలేను. నీవియోగమునచే నాజీవిత మిప్పుడే మహాబాధకరముగఁ దోచుచున్నది. నీవియోగంబుచే నాకీ పుట్టినిల్లు యమకూపంబుపగిది

గన్పట్టుచున్నది. (కన్నీటిం దుడుచుకొనును) మీయమ్మ ద్వితీయవివాహ మొనర్చినదని వింటిని. ఆభార్యతోగూడ నకు వియోగము సంభవింపవలయునా? నికష్టసుఖంబులు జూచువారులేక మనస్సున నెంతగ దిగగుల్ళ్ళు మంటివోగదా? తల్లితోనైన మాటాడుటకు సిగ్గువడుదువు. నీమనసెరింగి, నీ యిష్టోపచారంబు లొనర్చువా రెవరు? ప్రాణనాథా! ఎన్నటికైన నా కండ్లఁబడుదువా? పరమేశ్వరా? పరాత్పరా? పరవనితాపరాన్ముఖు. సత్యభాషణు, సదాచారనిరతు, సాధుశీలు, మాతృపూజాతత్పరు నాతపఃఫలమును, నాభర్తను నాకెన్న డనుగ్రహింతువు?

[రుక్మిణి తమ్ముఁడు సుబ్బారావు పత్రికతో ప్రవేశము]

సుబ్బా—(ఆశ్చర్యమున) అక్కయ్యా? నీయత్తగారు డాక్టరులీల మహమ్మదు డాక్టరు లతీఫును బెండ్లియాడినదట. అతఁడు ఎలెక్షన్సులో ప్రెశిడెంటుగా నిలిచి, యోడిపోయినాడట.

రుక్మి—(ఆశ్చర్యమున) ఏమంటివి? ఏమంటివి?

సుబ్బా—(పైమాటతే తిరుగ జెప్పును)

రుక్మి—నీకెట్లు తెలియవచ్చినది?

సుబ్బా—పత్త్రికలో బ్రచురింపఁబడినది. ఇదిగో చూడుము. (అనిపత్త్రికనిచ్చి, నిష్క్రమించును)

రుక్మి—(చూచుకొని యాశ్చర్యమున) డాక్టరులీల, మాయత్తగారే. (యని మరలఁ జూచుకొని) మాయత్తగారే. (పత్త్రికం జూచి) డాక్టరులతీఫుసాహెబు (ఆలోచించి) తరచు మాయత్తగారితో మాట్లాడుటకు వచ్చుచుండెడివాడు. (ముక్కుపై వ్రేలిడుకొని) వివాహమా? అయ్యయ్యో! నాయట్టి యైభ్య రాశియు, రెండవకోడలివంటి నవనాగరికతాసంపన్నయు నచ్చని విమషీమ తల్లికి మతాంతరుఁ డెట్లు నచ్చెనో? (యని శిరఃకంప మొనర్చి) దూరదృష్టి లేక యెంత తెలివితక్కువ పనిచేసినది? (ఆలోచించి) ఈలతీఫు ప్రెశిడెంటు పదవికి stand అయి యోడిపోయినాడట. మాయత్తగారియా స్తియంతయుఁ బోయియుండవచ్చును. ఆతేమిలో నీమె కొపుర మెన్నాళ్ళు నెగ్గును. ఈమె స్వాతంత్ర్యప్రియురాలు. పట్టుదల, ముంగోపము హెచ్చు. ఈవివాహముతో నామె జీవిత మేమైపోవునోగదా? (భర్తం దలంచుకొని) ప్రాణనాథా? (విచారమున) ఈవల భార్యావియోగము. ఆవల నవమానకరం బగు మాతృవియోగము. అయ్యో! హృదయంబున నెంతనురపిల్లుచుంటివో గదా? జీవితేశ్వరా? చివరికేకాకిన్నైతివా

సీ. అలరుదోయింటనే సహారహా మర్చించు
మాలతీస్శిరసు సేమంతిపూలు
చిఱుబంతిపసుపాడి మెఱుఁగినిచ్చలుసేయు
దివ్యసావిత్రీసతీవ్రతంబు
కడివోనిభక్తి మంగళవారముననోచు
కడుపుచల్లనితల్లి గౌరినోము
శశికళాజూటుఁ బూజలుసేసి నాల్జాలు
శివరాత్రి నుపవసించినఫలంబు

గీ. భవ్యకృపఁగాచుఁగాత మత్ప్రాణనాథు
పరమదయఁ జూచుగాత మత్ప్రాణనాథు
పాలనముసేయుఁగాత మత్ప్రాణనాథు
వైభవసనాథు గుణసాధు ప్రాణనాథు.

(నిష్క్రమించును)

# నవయుగము

## పంచమాంకము.



### ప్రథమరంగము.



[డాక్టరు లతీఫు గృహము. డాక్టరు లీల ప్రవేశము]

లీల—(కూర్చుండి విచారమున) అయ్యో? నానిరంకుశస్వేచ్ఛావృత్తి చివరకు నాకెట్టి విషమస్థితిఁ జేకూర్చినది? సాధనమదోన్మత్తత నాసుఖజీవితము నెంతలో దుఃఖమయముఁ బొనర్చి మెరుపువలె నదృశ్యమైనది? భవిష్యత్ఫలాఫలంబుల నారయకుండఁ గండ్లకుఁ దట్టినయౌవనగర్వ మెంతపని చేసినది? ఆహా? ఆహాహా!

చ. అలమిన స్వైరితాబలిమి నన్యకులస్తుని చెట్టవట్టి, స
త్కులముఁ ద్యజించి, బంధువులకు న్వెలియై, యపకీర్తి కిక్కయై
కలధనమెల్లఁ బోవిడిచి, కత్తులబోనికిఁ జిక్కినట్టి యి
చ్చెలి కవసన్న చేతనకుఁ జేకురకున్నె ? దురంతదుఃఖముల్.

[పేదవాడగు డాక్టరు లతీఫు ప్రవేశము]

లతీ—(విచారమున దనలో) రంగ్ దేతీహై హినాపత్తల్ పేసీస్ జానికేబాద్ అఖ్లు ఆతీహై. బషర్‌కూ తోకరేన్ ఖానేకేబాద్. When poverty comes in at the door love flies out at the window. It is easy to conceal wealth but difficult to conceal poverty. (లీలం జూచి బొమలు ముడిచి యసహ్యదృష్టితో) ఎప్పుడూ తగాదా యేదూ? గందర్గోళం. ఈపెండ్లీ వద్దని యెంతచెప్పినా, నామెడలువిర్చి గోతిలో దింపావ్. గోతిలో దింపావ్. నిన్నూ పెండ్లీ చేసుకున్నందుక్కూ హిందువులందరికీ కోపంబుట్టి నావొద్దకి రాకుండా కట్టూగట్టేనారు. నిఖా సేయలేదని కులంవాళ్లు నన్ను వెలివేశారు. నీకులంవాళ్లు నిన్నూ వెలివేశారు. రిఫారం రిఫారం

అని ప్రోత్సాహంచేస్తి రిఫార్మర్సు యిప్పుడు పలకరించరు. నీప్రోత్సాహంచే Elections లో నిగి, ఆస్తి పోగొట్టుకున్నా, ప్రాక్టీసు పోగొట్టుకున్నా, స్వాహా హోగయా. దరిద్రంపట్టుకుంది. (ఆలోచించి) నాకర్మంవల్ల నేను చెడి పోవచుంగానుండగా, నిస్సారణం, అమాయకునిపైన, నీరన్నమీద, స్వతంత్రత్రల్లో బడిబోయి, నా పార్టీ మెంబర్లచేత No Confidence motion పెట్టించి, ప్రెసిడెంటుగిరీ కష్టగట్టిఊడలాగించా. ఈ ప్రెసిడెంటుపదవినన్నుకోసి ఉన్న చేస్త్రీ పదవికిరిజైన్ పనిచ్చి, రెంటికిచెడి, పాసనై చివరకుకాల పొలాలుమున్నకుంటున్నా డాకిరన్న (కోపమున) అందరు పాడైపోవుటకు నీవే కారకురాలవు విలన్ రావు మాటల్ విని, పెద్దకొడుక్కు గెంటేశావ్. నిముందూ నేనూ నెగ్గుతానూ? నీసొతంత్ర్యం, నీపెంకీతనం, నిన్ను వదల్దు. నామాట నీకు లచ్చంలేదు. నీదారినీది నాదారినాది. ఈదరిద్రంతోడూ యీబాధా కూడా యెట్లాభరించేది? ఒక్క క్షణం నీవు నా యింట్లో ఉండారాదు. నా యింట్లోంచి లేచి పో. పో. (యనినిష్క్రమించుచుమరలివచ్చి) ఏదో కుట్రా చేస్తున్నార్, లేకపోతే వకీలురావ్ నాపిద్దిలో రోజూ యెంక్కు వస్తున్నాడూ? ఎప్పుడైనా వచ్చాడా? (యని నిష్క్రమించుచు) This sort of modern educated woman is like a bad photograph for she is under devoloped & over exposed. (పండ్లు పటపట గొరుకుచు మండిపడుచు నిష్క్రమించును)

లీల__(విచారమున నాలోచించి గలనూచి) ఇది నాస్వయంకృతాపరాధముగాని సీతప్పావంతయులేదు.

గీ. సంఘసంస్కారిణినటంచు సంస్థలెల్ల
మెచ్చునని పెండ్లియాడితి మ్లేచ్ఛునకట!
జతపడునె? పరస్పరగుణాచారవిధులు
అన్యకులదంపతీయోగ మస్థిరంబు.

స్త్రీసంఘమునకు మార్గదర్శినింగావలయునని, B.A. ప్యాసయి డాక్టరీ ప్యాసయి, చివరి కెట్టి దుష్టనిదర్శనముం జూపితిని. ఆహా! రావు తంత్రి మహిమ యీదాంపత్యధ్వంసనమునకుంగూడ గారణమైనదిగదా? (దుఃఖమున) ఈలతీఫు నన్నింత యవమానపరచునని స్వప్నముననైనఁ దలంపలేదు.

చదివిన చదువెంత నిరర్థకమైనది? ఆహా? నాకెట్టిగతి పట్టినది? చివరకు నాజీవిత మెంత హాస్యాస్పదమైనది? (పొంగి పొరలివచ్చు దుఃఖమున) ఆగర్భశ్రీమంతులకడుపునఁబుట్టి, యాగర్భశ్రీమంతుల యింటబడి, మహైశ్వర్యభోగంబు లనుభవించుచున్న దానికెట్టి గతి సంప్రాప్తించినది? ఇట్టి నింద యిట్టిదుర్గతి, నానొసట నుండుటచేతనేగాబోలు, Professor రూపవంతుడు, నగు భర్త యాకస్మికముగ బాల్యముననే మరణించెను. నా యిష్ట స్వతంత్రలకు నిచ్చావస్థగాక భోగావస్థవట్టునా? కొడుకునకు మారుగా గన్నులకద్దుకొనుచు, గడియగనుపింపకున్న నల్లాడు యుత్తమురాలగు నత్తగారిని నిరాదరణ మొనర్చితి. ద్రోహమొనర్చితి. అత్తమామల నుసురు వెట్టి యేడ్పించిన కోడండ్రకు దుర్గతిగాక సద్గతి కల్గునా? కడుపునబుట్టినకొడుకు కంటె మిన్నగఁ ప్రేమించు దత్తపుత్రుని ద్రోహమొనర్చి, యీకపట స్నేహితుల, యీగోముఖవ్యాఘ్రముల, పయోముఖవిషకుంభముల, నమ్మి, యాస్తినంతయుఁ దగులబెట్టి, యావజ్జీవము నాజీవమున కుసూరుమనిదుఃఖించు నట్లుండ నిల్లుఁ బండ మంచము తినుటకు దిండి, లేని భిక్షుకునిగ నొనర్చితి. కలిస్వరూపుడగు వకీలురావు మాయావాగురఁజిక్కి మహాపతివ్రతయగు కోడలిని నదింద్రోయించి, కొట్టితిట్టి యన్నహారములు పెట్టింపక, తుదకుఁ జిత్రాంగివలె కపటనాటకమాడించి భర్త కెడబాపుజేసితి. ఇంతకంటె మహాపాప మెద్ది? మహాఘోర మెద్ది? పెండ్లిండ్లమీదఁ బెండ్లిండ్లొనర్చి కోడండ్ర యుసురు బోసికొనిన, మదోన్మత్తలగు నత్తలకౌపాపఫలిత మెక్కడనోగాదు బ్రతికియుండగనే కన్పించితీరును. చదువుకొనిన యాడుది కనుపడిన వెంటఁబడి తిరుగు యంగుడుముడుపులు ప్రియమిత్రులపగిదిగన్పించుచుఁ జివరి కన్నివిధముల జెరుపుమురుగదా? ఎంతదూరదృష్టిలేనిదాననైతిని? ఎట్టి యాలోచనావిరహితనైతి. స్వకులస్తునినైన వివాహమొనర్చుకొనక పోయితినిగదా? కులస్తుడే దొరుకకపోవునా? సంఘము వట్టిపోయినదా? నా యౌవనమద మెంత చేసినది?

చ. కులము నశించె, గౌరవముగూలెను, సంపద వోయె, శీలమా
తొలఁగె, దురంత దుఃఖదశదూకొనె, స్వైరవిహారవృత్తికిన్
ఫలిత మిహంబునందె గనుపట్టె ధరాస్థలి నాదుజన్మ ని
ష్ఫలము విషంబుద్రావి బలవన్మరణంబునఁబ్రాణమీగెదన్.

నా దుష్ప్రవర్తనమునకు మరణమే ప్రాయశ్చిత్తము. సర్వాశయములుచెడి, యవమానమునకులోనై, దారిద్ర్యమున సెగలాడుచు నీబ్రతుకు బ్రతుకుటకంటె మరణమే యుచితము. చేసిన ద్రోహము దాచు టెందులకు ? (యని లేఖ వ్రాసి) నౌకరా ! ఈయుత్తరముంగొనిపోయి, మామురళీధరుని కిచ్చిరమ్ము. (అని యుత్తరము నావలకు విసరివైచి దుఃఖించును) రుక్మిణీ ! నా యట్టి యత్తల మరణానంతరమే నీబోటి కోడండ్రకు సంసారసుఖము. (అని చెంగుననున్న విషచూర్ణము మ్రింగి గ్రుడ్లు తేలవైచి, పడిపోయి, మరణావేదన ననుభవించి, మరణించును)

## ద్వితీయరంగము.

[ఒకసందు. వకీలురావు ప్రవేశము]

రావు—(జేవుజేవని త్రేన్చి విచారమున) ఆహా ! పుస్తకములపెట్టుబడి డబ్బునకు వడ్డియైన గిట్టుటలేదు. ఎట్టి దుష్కాలము వచ్చినది ? ఏజెంటుకమీషనుపోను వచ్చినక్రిమినలుకేసునకు తొమ్మిదణాలు ఫీజు. ముందు చూపు లేక యెదుటి గౌరవ మాలోచింపక బోనిలోని కెక్కించినసాక్షులనెల్ల నధికారమున్నదని యవక తెవక ప్రశ్నలువైచి యగౌరవించుటచే నందరు విరోధులై చివరి కా డబ్బులుగూడ ముట్టకున్నవి. ఎలెక్షనులో దొరికిన డబ్బంతయు మధుపాన దుర్వ్యసనాగ్ని కాహుతియై, దుర్భరాజీర్ణరోగపీడితజీవచ్ఛవంబనై, యే క్షణంబున కాక్షణంబు ప్రాణప్రయాణసమయమే తెంచినట్లు భయం బుదయించుచున్నది. ఆహా ! (జేవని త్రేన్చి పశ్చాత్తప్తుడై)

గీ. ఆయురారోగ్యధీశక్తి నపహరింప
గడనమ్రింగుచు నాస్తినిఁ దుడిచివైవ
నాలుబిడ్డల దారిద్ర్య కీలనేర్చ
బ్రాంది, విస్కీ, సృజించితివా రమేశ.

న్యాయవాదిసోదరులారా ? ఈయూరనున్న మీరందరు జితేంద్రియులు. మీరందరు ధనార్జనమే ముఖ్యముగ నెంచక, నీతి న్యాయ్యము, కృతజ్ఞత,

పరోపకారము, సదాచారము గలిగి ప్రవర్తించు విద్యార్థికులు. నేనును మీవలె విద్యార్థికుడనయ్యు, సిద్ధశాపస్థంబొందిన యవివేకిని. If we subdue not our mean passions they will subdue us. Man without selfrestraint is like a barrel without hoops and tumubles to pieces. When drink enters wisdom departs. Whisky hath drowned more men than ocean. To day it is our pleasure to be drunk and it would be our queen for ever. What India needed to day is self control but not birth control.

(బజారునకుఁ బోవుచుఁ గూరలబుట్టఁ జేతఁబట్టుకొని వీరన్న ప్రవేశము)

వీర—(చిరునగవున) ఒక్కళ్లు సంచులట్టా రేంటిబాబూ ?

రావు—Ex. President గారి దర్శనముదొరకునని. (తేవని త్రేన్చును

వీర—(విచారమున) బాగున్నారూబాబూ ? సాలాకాలమైంది సూసి.

రావు—(విచారమునఁ దలనూఁచి) ఇప్పటికిట్లున్నాను. ఎక్కడనుంచి యీరాక?

వీర—(విచారమున) ఇయ్యేళదాకా పాలంపనైంది. బజారుకెల్తున్నా. కొంపంతా రోగాలు రొచ్చులు. నాబతుకంతా సీకాగ్గావుంది. ఏం సెప్పను?

రావు—ఎలెక్షను తాలూకు బ్యాండు మంగళ్లు బళ్లవాండ్రు, కిరాయిబాకీలకు నన్ను బాధించుచున్నారు. అవికూడ లేదనిపింపరాదగా ?

వీర—(ఆలోచించి యాశ్చర్యమున) ఇదేంటయ్యా? ఆపెలెక్సనేజెంటు నాటకాల నాగన్న కప్పుడే, ఆసొమ్మంతా యిచ్చాశానే. ఇంక బాకీయేటి గాశారం?

రావు—అందలేదు.

వీర—(కోపమున) కొట్టేశాడుగామోసు. దొంగమొగం ఆనూ. పుల్లాపుల్లామంటా ఇసం ఓడ్తావుంటది, పూజారిమొగం. దొంగనాకొడుక్కు. ఇల్లా యెంతమంది బుణాన్నిబడుంటాడో ?

రావు—గీ. డాఫరుం ద్రాగుబోతు తుంటరి దళారి
బండ మొండి శిఖండి దివాలకోరు
నాటకాల నాగన్న పింజారి పలువ
యెవరి గొంగక యనుదినంబెట్లు బ్రతుకు ?

ఎట్లయినను బాకీ యీయకతప్పదు,

వీర——(కోపమున) ఆఁ ఏంటి? ఎలెక్సన్లై యేంతకాలమైంది? ఇదెప్పటిబాకీ. సేరుమేనుద్దోగానికి సేతులార రిజిగ్గేసం యిప్పించావు. పెశిండెంటు గిరీకినిల మెట్టించావు. అపక్కానా యీ పక్కానా, రెండుసేతులా దోసుకున్నావు. సూరారావుసేత రిజిగ్గేసంయిప్పించి, సివరికి సాయిబుని, నన్ను సవరం సేశావు.

గీ. డబ్బుకోసరం జల్మించి, డబ్బుకొరకె
బతుకుసుంటివి, డబ్బె నీప్రాణదనము
కోసినూసిన లేదిను వాసబుద్ది
నోరుదెరుతువు డబ్బునకేరికైన.

మీకుపుట్టుకేం దక్కిందయ్యా? ఏందక్కిందీఅంటా?

రావు——కోప మెందుకు? చివరకు సీవే నెగ్గినివిగదా!

వీర——(విచారమున) తంత్రాలెట్టి, సాయిబుసాంగ్గ్రేసేత నోకాంపిడెన్సు మోసనెట్టించి, నన్నూడలాగించి సివరికిద్దర్నీ కోర్టులు యెక్కించావు. నమ్మినోణ్ణి నన్ను సామిద్రోవం జేసి పకీర్ను జేశావు. (దుఃఖమున) అన్నోతకాలంలేక పెల్లాం పిల్లలతో సిజీవాని కుసూరుమంటా యేడుత్తున్నా. ఆపెశిండెంటుగిరీ ఊడి పోకపోతే, ఒకయెలుగువెలిగేవోణ్ణి. ఆ ఒకయెలుంగెలిగేవోణ్ణే. పుట్టినోణ్ణి పుట్టినట్టు మిగిలాను. ఇప్పుడు నాకాడేముంది? ఎంత ఆస్తి ఎంత ఆస్తి.

సీ. గోసెట్టి మాబాబు కూర్చి యిచ్చినడబ్బు
బట్టగొట్లమొగాన బెట్టినాను
ఆడవోళ్లు పిడకలమ్మి దాసినసొమ్ము
మోటారుల యెదాన మోసినాను
మాతాతగొన్నట్టి మాన్నాలు తెగనమ్మి
పెద్దవోట్లకు కర్సుపెట్టినాను
పాడిమందపరాబు పరభారికొదిలేసి
మెంబర్ల కెల్లను మేపినాను
గీ. అయిన సుట్టాల దీపాల నార్పినాను
ఎంతొ గొప్పోడనగుదునం చెంచుచుండ
కొనకు నోకాంపిడెన్సు నాకొంపదీసె
మొందుకెల్లితే నం చిప్పదేడ్సునుంటి.

ఎనకటిరోజులు తల్సుకుంటే కడుపు సముద్దరం అయిపోతూంది. అంత ఆస్తీ సీదాగా పోయింది. పాలికాపోళ్ళు పిలవడానికి బిరుదొక్కటీ మిగిలింది. బాబూ ? మీరుసేసిన జోగిని. సెలవ. ఎల్తామరి. దూడలొచ్చేయేలయింది. (అని నిష్క్రమించుచు) సేన్హితులంతా యినండిబాబూ ? ఇనండి.

సీ. పంతాలకోసమై బార్యల నగలమ్మి
ఆ వెలక్సను జూద మాడకండి
గొప్పలకోసమై కొంప్రల తెగనమ్మి
యేజెంటుసైతాన్ల కివ్వకండి
పదవులకోసమై బ్రాంకి నప్పులుదెచ్చి
ఓట్లకై తగలెట్టి ఒరలకండి
డబ్బుకోసము రొంటి డబ్బులంచాలతో
మెంబరు దొంగల మేపకండి.

గీ. బాపనోళ్ళకు సెల్లును బ్రట్టులయిన
మనము కలయిర్తి యిడిసిన మారలేము
అనుబవము మీద సెప్పితి అమ్మతోడు
రాకడీ వెలక్సనులకు రైతులార!

(నిష్క్రమించును)

రావు—(విచారమున) నిశ్చయము. నిశ్చయము. సంపన్నగృహస్థుడు, కుటుంబీకుడు, నమాయకుడును నగు నీరైతు, ఎలెక్షనులోనికిందింపి, పట్టుదల పెంచి, యాస్తి నమ్మించి, యీదుస్థితికిం దెచ్చిన స్వలాభార్థిని నేనే. అతని దుఃఖమ్మును జూచిన నాగుండెగూడ నీరగుచున్నది. (ఆలోచించి) ఆహా ? దుష్టస్వభావుండనై యెట్టి కృత్రిమవిధానములకులోనైతిని. అమాయికురాలు, నిష్కలంకహృదయయగు లీలను నామినేసనుసీటుననిలిపి, చల్లగ ఎలెక్షనులోనికిం దింపి యెన్నివిధములనో యామెను ద్రోహ మొనర్చితిని. ఏగొడవకుబోని, యుత్తమపురుషుండగు డాక్టరు లతీఫుయొక్క యభివృద్ధి సహింపలేక, మాయావాగురంబడద్రోసి చేతులార పకీరును జేసితిని. లీలా లతీఫుల యనురాగదాంపత్యధ్వంసమునకు, లీల యకాలమరణమునకు నేనే కారకుడను.

నేనే కౌరకుఁడను. కూర్పుఁడ, స్వామిద్రోహుఁడ, కృతఘ్నుఁడ. ఆద్రోహము నకు ఆమోసమునకు నా కెట్టి గతి బట్టనున్నదో గదా? స్వలాభవాంఛ నాచే నెట్టి నీచకార్యంబులు చేయించినది? ఎంతపాపంబున కొడిగట్టించినది? ఎంత యపకీర్తి దెచ్చినది? అహా?

సీ. తోడివారలు దినంతులుగొట్ట డబ్బెల్ల
    విస్కిగోదాముల వెచ్చఁబెట్టి
ప్రజలు సీసీ యన వ్యభిచారినై తిర్గి
    యింటిని నొంగని మంటగలిపి
అన్యార్థకాంక్షచే నంగుడు దుడిపినై
    పచ్చనికొంపలఁ బాడుచేసి
ఋణదాత లిరుప్రొద్దు లింటిపై బడుచుండ
    పెరటదొంగరికపు బరువువెట్టి
గీ. వాసిచెడి, పేరడంగి ప్రాకిటనుబోయి
    మాయ, ద్రోహమ్ము, కుట్ర దుర్మార్గవృత్తి
    సాధనములుగ బ్రతుకు విద్యాధికునకుఁ
    దుట్టతుదకెట్టె దుర్దవస్థ బట్టుగాదె.

(నాచేసిన దౌష్ట్యములకన్నిటికంటె, మహాదారుణము, మహాఘోరము, ఆ రుక్మిణీదంపతుల వియోగము. ఆరుక్మిణి యమాయకురాలు. నోరులేనిది. స్వమతకులాచారధర్మనిబద్ధహృదయ. నిరుపమానపాతివ్రత్యపవిత్రితపావన చారిత్ర. అసాదృశసాధ్వీమతల్లి. స్వలాభకాంక్షావిస్మరితపాపహృదయుం డనై యత్తకోడండ్రకు స్పర్ధంగల్పించి, రుక్మిణీకాంతామతల్లి కాపురముం బాడుజేసి, యాయనురాగదంపతుల దాంపత్యంబున కంతరాయంబుగల్పించి, యాపతివ్రత యుసురుబోసికొంటిని. ఆదారుణచర్య నిర్ధూమజాజ్వల్యకరాళ కీలాసదృశంబై నాహృదయాలయంబును పటాపంచలుగ భేదించుచున్నది. శతధాభిన్నముగ భేదించుచున్నది. శుష్కేంధనవహ్నికీలవోలె నాహృదయ కుహరమును దహించుచున్నది. (యని శరీరముం జూచుకొనుచు కంగారుగ) ఆహా? ఏమిది? నాసర్వావయవంబులు నిజబలచ్యుతంబులై, నిస్సారంబులై

స్వాధీనతావిరహితంబులై, సద్యోవిపత్తునెద్దానినో స్ఫురింపజేయుచున్నవి. నిష్కృముట్టికొనిన పాక్షికమానదు. చేసిన పాపఫల మనుభవింపకతప్పదు. (యని యాలోచించి) కాని యారుక్మిణీసతీమతల్లికడకేగి క్షమార్పణవేడుకొని నచో కొంతవరకు నాకు మనశ్శాంతి చేకూరును. పాపక్షయంబగును. (అని నడువలేక నడచుచు) అపతివ్రతాసందర్శనంబున కరిగెదగాక. (భయపడుచు, దీనవదనుండై మెల్లగ నిష్క్రమించును)

## తృతీయరంగము.

(రుక్మిణిపుట్టినిల్లు. వృద్ధురాలగు యశోదచేయిఁ బట్టుకొని మురళీధరుఁడు వీధిలో ప్రవేశము)

ముర—(విచారమున)

చ. పరమపతివ్రతామణిని భార్యను, మాతృని దేశబద్ధుఁడై
పరమతిఁబారద్రోలి, పరివాదమునొంది, ద్వితీయపత్నినిం
బరిణయమాడు పాతకుని భాగ్యమువోదె ? విపత్పరంపరల్
పరిగొనవే ? ప్రపంచము ద్విపాత్పశువంచుఁ దలంపకుండునే.

యశో—(విచారమునఁ దనలో) మానాయన తెలియనివాఁడా ? అన్నిధర్మములు తెలిసినవాడే. గ్రహచారము. గ్రహచారము. (ప్రకాశముగ) పదరా. ఇదియే నీయత్తవారిల్లు. పదరా నాయనా? పదరా? అడుగేపడకున్నదేమిరా? చేతులకు వొణుకుఁ బుట్టినది. లేచిన కూర్చుండలేను. కూర్చుండిన లేవలేను. మృత్యువు నీడగన్పట్టుచున్నది. అంతయు నుడిగినది. ఆగడియకోసము కని పెట్టుకొనియుంటిని. నాయనా ! ఉన్నభార్యనువదలిపెట్టుకొని, యూపిరి లేని ముసలిదానను నన్నెంత కాలము చంపెదవురా ?

ఉ. ఎద్దడినీళ్ళు, బిందె బుజమెక్కదు. ఎత్తినదగ్గు. బావియుం
బెద్దది, చేదలాగ వెనువెన్నునఁ బోటుదయించు. నత్తెసర్
ముద్దగు, వార్చినంబలుకు, ప్రొయ్యిసెగంబడలేనశక్త. నీ
పెద్దతనానఫండి తిను పిండము పిండసమానమాఁరయున్.

మురా—(దుఃఖమునఁ దలనూచి) బామ్మా! నిశ్చయమే. నాతల్లి మరణించుచు వ్రాసి పంపినలేఖతో, నాయొనర్చిన ధర్మపత్నీ ద్రోహము సర్వము గోచరించినది, ఆమరణాంతము నాకష్టసుఖములకుఁ దోడు నీడయై, యుండునని యగ్ని సాక్షిగ బాణిగ్రహణం బొనర్చిన నాయర్ధాంగ లక్ష్మిని, నావంశము నిల్పి యీ సంసార సాగరముం దరింప నాకుం దెప్పయై వచ్చిన ధర్మపత్నిని, వంచించిన మహాద్రోహిని. నా పాపదృష్టిచే, నా గాలిచే, నా పవిత్రవతిని నపవిత్రగ నొనర్చుటకు నా శరీరము కంపించుచున్నది. నా హృదయము నీరగుచున్నది. నా కాళ్లు తేలి పోవుచున్నవి. ఏ మొగము పెట్టుకొని యా కాంతాస్వాంత పవిత్ర ముఖాబ్జముఁ జూతును. అదియునుంగాక.

ఉ. ఆస్తి ఋణాగ్ని దగ్ధమయి, యల్పపువింద తలం ధరించి, య
భ్యస్త కళావివేక యశమారడి వచ్చిన యల్లునింబ్రియో
పాస్తిని గౌరవించుదురె! బావయు నత్తయు, బామ్మ! నీకు చా
దస్తము ద్రవ్యబాంధవులు ధాత్రి సమస్తజనంబు లారయన్.

ఈయరుగుమీదఁ గూర్చుండెద. (యని పైకిఁ జూచి యాలోచించి తలనూచి) బామ్మా?

సీ. ఎట్టి ధనాఢ్యుడైన మది నీపదహామ్మతిఁ బూనఁగూడ దె
ప్పట్టునఁ జంచలాచపలభాగ్యము నమ్మఁచుఁ బుట్టి కట్టెలం
బెట్టెడుదాక నొక్కగతి వెళ్ళదు కాలమటన్న సూక్తు లీ
ఘట్టులనీడ జ్ఞాపకముఁ జేసెడి మాదృశమందబుద్ధికిన్.

(అని యింటి వీధియరుగుమీదఁ గూర్చుండును)

యశో—(నిట్టూర్చుచుఁ దనలో) అత్తవారిపేరు వినబడిన, నెంత యై. పి. యల్లునికైన తగని యభిమానము తగని టెక్కు తల కెక్కును. (కొన్ని యడుగులు నడచి) ఈదత్తపుత్రుని శోకము నాపాలబడినదేమిరా దైవమా!

(యని యశోద నిట్టూర్చును. తెరనెత్తుటతోడనే పూజఁ జేసుకొనుచు రుక్మిణి ప్రవేశము)

రుక్మి—(నిమీలితనేత్రయై భగవద్ధ్యాన మొనర్చుకొనుచుండును)

(యశోద ప్రవేశము)

యశో—(కన్నీటిం దుడుచుకొనుచు) నీజీవితమున కెన్ని పాట్లు వచ్చినవే తల్లీ! నా గృహలక్ష్మి నీతోడనే తొలఁగిపోయినదే మాయమ్మ. (బోరున దుఃఖించుచు) చంటిపిల్ల, నెవపిల్లఁగని పెంచు నీడులో పూజలం పురస్కారములతో దినములు వెళ్ళఁబుచ్చుకొనుచుంటివా తల్లీ. ఎన్ని కష్టములు వచ్చినవే మాయమ్మ (యని కన్నీటిం దుడుచుకొనుచుండును)

రుక్మి—(కండ్లు తెరుచును)

యశో—అమ్మా రుక్మిణితల్లీ? (యని దుఃఖించును)

రుక్మి—(తెల్లబోయి చూచి యానవాలుబట్టి దుఃఖముతో బిగ్గరగ) అమ్మమ్మా? (యని బోరున దుఃఖించుచుఁ గౌఁగిలించుకొని బిగ్గరగ) అమ్మమ్మా? నేను బ్రతికియుండగనే నన్ను జూడవచ్చితివా?

యశో—(దుఃఖించుచు) ఔనుతల్లీ? నేను బ్రతికియుండగనే నిన్నుఁ గండ్లారఁ జూడవచ్చితి. మీపవిత్రానురాగదంపతుల చేతినీళ్ళతో సద్గతుల నొందుటకు వచ్చితి.

రుక్మి—(బోరున దుఃఖించుచు) ఈదురదృష్టవంతురాలి కీపాపాత్మురాలి కీజన్మమున నట్టి సుకృతముగలదా అమ్మమ్మా! ఏకొంపురము బడద్రోచితినో, ఏయను రాగదంపతుల నెడబాపితినో, యాఫలం బిప్పు డనుభవించుచున్నాను.

(అని బోరున దుఃఖించును)

యశో—(రుక్మిణి కన్నీటిం దుడుచుచు) అమ్మా? దుఃఖింపకుము. గ్రహస్థితికిఁ జంద్రమతీదమయంత్యాది సతీమతల్లులే కష్టపడిరి. భగవత్కృపచే నేటికి మీ దంపతులకు సుఖసంయోగ మేర్పడినది. నీపెనిమిటి పశ్చాత్తప్తుడై, నీముఖము జూడలేక గ్రుడ్డునకుం గుంచెడొంచుచు గూర్చున్నాడు.

రుక్మి—(ఆత్రమున దిగ్గున లేచి) ఆఁ ఆఁ! నాప్రాణేశ్వరుఁడేడీ? నాప్రాణనాథుఁడేడీ? నాప్రత్యక్షదైవమేడీ? నాయానందస్వర్గమేడీ? (ఇటునటుఁ జూచి) నాథా! నాథా! నాథా! ఎచ్చట నుంటివి.

యశో—(దుఃఖించుచు) మొగము చెల్లక వీధియరుగుమీదఁ గూర్చున్నాఁడా వెఱ్ఱి నాగన్న.

రుక్మి—(ఆత్రమున బరువిడిపోయి భర్తృపాదంబులపై వ్రాలి దుఃఖించును)

ముర—(తుళ్ళిపడిలేచి దుఃఖమున) ఓపవిత్రవతీ! ఈధర్మపత్నీద్రోహిని, నీ కృతఘ్నుని, నీచదువుకొనిన మూఢుని, ముట్టకుము. ముట్టకుము.

రుక్మి—(దుఃఖించుచు) ప్రాణనాథా ? నాయపరాధముల క్షమింపుము.

ముర—(రుక్మిణిని లేవదీసి దుఃఖించుచు) ధర్మపత్నీ !

సీ. పావనిఁ ద్రోసిన పాపంబునకు నేన
యర్హుండఁగాని నాయమ్మ గాదు
అపకం ద్రోసిన యధికాఘమునకేన
దండ్యుండఁగాని నాతల్లిగాదు
గరితెపాతలిసిన క్రౌర్యదుష్కృతికేన
ననుభోక్తఁగాని నాయంబగాదు
నగలొల్చికొని రంకుఁ బగగొన్న నికృతికే
క్షమితవ్యుఁడనుగాని జననిగాదు

గీ. అనుపమానసతీమణివైన నిన్ను
దుఃఖపెట్టిన కులసతీద్రోహమునకు
కట్టఁ గుడిపిన బాధలుగాక యెట్టి
నూత్న నరకంబు సృజియించునో! యముండు.

గృహలక్ష్మీ ? నీపవిత్రహృదయపీఠంబున నా పాపపరిహారమునకుఁ దావుగలిగిన నన్ను క్షమింపుము.

(పక్షపాతరోగభూయిష్టుఁడై రూపము మారి వకీలు రావు ప్రవేశము)

రావు—(దుఃఖమున) ఓరుక్మిణీసాధ్వీ ? ఈక్రూరుని క్షమింపుము. ఈద్రోహిని క్షమింపుము.

(అందరు నాశ్చర్యమునఁ జూచుచుందురు)

ముర—(ఆశ్చర్యమునఁ జూచి) ఎవరువారు ?

రావు—నాయనా !, మురళీ ? నామేనగోడలిని నీకిచ్చి వివాహ మొనర్పఁ దలంచి, యమాయకురాలగు నీతల్లికి, నుత్తమురాలగు నీభార్యకు స్పర్ధలంగల్పించి, ప్రణయలేఖంగల్పించి కపటనాటకమాడించి నీకు భార్యావియోగంబుఁ జేకూర్చిన ఖలుండ, పరులకొంప. లుదీసి బాగుపడ నెంచిన స్వలాభార్థినగు వకీలు రావును నేనే. నాయనా ! నీధర్మపత్ని మహాపతివ్రత, నిర్దోషురాలు. అమ్మా

రుక్మిణీ! నిన్ను సుసపెట్టిన పాతకఫలంబిహంబున నేవిధంబుగ ననుభవించుచుంటిని. నీయెడం జేసిన యపరాధముల నానోట నేనే యొప్పుకొనుచుంటిని. నన్ను క్షమింపుము. తల్లీ! నన్ను క్షమింపుము.

మురళి—(విచారమున) ఆర్యా? మీయవస్థం జూచిన నాకు మరింత దుఃఖము గల్గుచున్నది. మాయవస్థ దైవకృతము. ఒకరు చేసిరని యనుకొనుట యవివేకము. పశ్చాత్తాపఫలంబుగ పరమేశ్వరుడు మీకు సౌఖ్యం బొసంగుగాక.

రుక్మి—(విచారమున) నాయనా! పూర్వజన్మంబున నేపుణ్యదంపతుల నెడబాపుం జేసితిమో యది యిట్లనుభవించితిమి. విచారింపకుడు. దైవంబు మీకారోగ్యమొసంగుగాక.

రావు—(ఆనందమున) మీయనురాగదంపతుల పునస్సంయోగము నాకానందము. అమితానందము, బ్రహ్మానందము. నాకిప్పుడు మనశ్శాంతి చేకూరినది. ఇక నాకు భగవదారాధనమే మోక్షసాధనము. (అని భగవద్భజన మొనర్చుకొనుచు నిష్క్రమించును)

(ఆనందమున మురళీధర రుక్మిణీ దంపతులు యశోద పాదంబులకు నమస్కరింతురు)

యశో—(ఆనందమున) దీర్ఘాయురారోగ్యైశ్వర్యాభివృద్ధిరస్తు. ఆచంద్రార్కము వంశాభివృద్ధిరస్తు. మీకడుపున నాలుగుకాయలుగాచి, యిచ్చిన భగవంతుడు మరచిపోయి, నూరేండ్లు సుఖముగా వర్ధిల్లుడు. నాబెంగ యిప్పటికిదీరినదిరా నాయనా! నీ మహాలక్ష్మిని, నీవుగలుసుకొంటివి, నీకేమికొదువరా నాయనా!

(రుక్మిణిసోదరుడు సుబ్బారావు ప్రవేశము)

సుబ్బా—(ఆనందమున) అక్కయ్యా! చిన్ననాన్న నీపేరచేయించిన యిన్స్యూరెన్సు పోలసీ ఫలించి, 50 వేలకు నీపేర చెక్కు వచ్చినది. (ఆశ్చర్యమున) వీరందరెవరు? (మురళీధరుని గుర్తించి యానందమున) బావా! వచ్చితివా? (అని కౌగిలించుకొనును)

యశో—(ఆనందమున రుక్మిణిం జూచి) మహాలక్ష్మివమ్మా! మహాలక్ష్మివమ్మా! (యని మురళీధరుని జూచి) మురళీ! లక్ష్మి మఱల నీకెత్తినది వింటివా?

మురళి—(ఆనందమునం జూచును)

రుక్మి—(భర్తం జూచి యానందమున) ప్రాణనాథా! ఆద్రవ్యమంతయు మీపాదపూజకు సమర్పించుకొనుచున్నదాన.

యశో—(ఆనందమున) అదిగో! మన రుక్మిణిబంధువు లందరు వచ్చుచున్నారు. శుభముహూర్తము జూచి మనరుక్మిణిని మన యింటికి తీసుకొని వెళ్ళుదము పద.

పుర — (ఆనందముగ)

గీ. అవని స్వాతంత్ర్య ధర్మాశయంబువిడిచి
యగ్నిసాక్షిగఁగొన్న భార్యలఁ ద్యజింప
కేకపత్నీవ్రతస్థులై, యిహపరములు
బడయుదురుగాత మెలమియావనులుప్రీతి.

(స్త్రీలు బంధువు లందఱు ప్రవేశము)

మంగళహారతి.

గద్య.

శ్రీమద్భ్యాండాడపురీనివాసచతుర్విధకవితాఫణీంద్రకాళ్ళకూర్యన్వయ
కలశపాథోనిధినిశాకర, భోగరాజకవీంద్ర పాపమాంబాదంపతీ
గర్భశుక్తిముక్తాఫల, సాంబశివరాయ, వెంకయ, రామమూర్తి
కవీంద్ర చతుర్థ సోదర, బాపాయమ్మ సతీధర్మపత్నీ
సహిత, చతుర్విధకవితాధురంధర, హనుమంత
రాయామాత్య ప్రణీతంబగు నవయుగ
ప్రకరణ దృశ్యప్రబంధమునం
బ ం చ మా ం క ము
సంపూర్ణము.



రామమోహన ప్రెస్, రాజమండ్రి—1935.